







దేవీప్రియదర్శిని పిక్చర్స్

# హారతి

స్క్రీన్‌ప్లే-డైరెక్షన్: లక్ష్మీదీపక్

నిర్మాతలు: యం.చంద్రశేఖర్-బండికృష్ణారావు

సంగీతం చక్రవర్తి

Veekay

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ అనిల్‌ప్రభాస్ ఎంటర్‌ప్రైసెస్ నవయుగ

KalaMandir


గంగాధర
విజయదశమి
అక్టోబర్
25
విడుదల!
నిప్పులాంటి మనిషి
ఈస్ట్‌మన్ కలర్
NAVRANG
నిర్మాత: వై.వి.రావ్ దర్శకత్వం: యస్.డి.లాల్
పూర్ణా రిలీజ్

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక


వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు

( 1938 – 1972 )

శుక్రవారం : 1–11–'74

ఆనందనామ సం. ఆశ్వీయుజమాస బ. పాడ్యమి.

*సంపుటము : 68 సంచిక : 7*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా – రు. 31–20 పై.
ఆరుమాసాల చందా – రు. 15–60 పై.
విడిప్రతి వెల 55 పైసలు

*ఆంధ్రపత్రిక కార్యాలయము*
*గాంధీనగరం, విజయవాడ-3.*


## విషయానుక్రమణిక



### మనలో మాట

*పాఠకులకు, రచయితలకు, ప్రకటన కర్తలకు అందరికీ దసరా పండుగ సందర్భంగా మా శుభాకాంక్షలు*

* * *

దీపావళి సంచిక వెలువడే తేదీ వివరం కోసం ప్రత్యేకంగా రచయితలు చాలా మంది ఎదురు చూడటం సహజం! 22-11-'74 సంచిక దీపావళి సంచికగా వెలువడుతుంది. పోటీలో ఉత్తమంగా ఎన్నికైన కథల ప్రచురణతోపాటు పాఠకుల నిర్ణయంకోసం 'బ్యాలట్' పత్రంకూడా ప్రచురిస్తాము ఐతే ముందుగానే మేము నిబంధనలలో పేర్కొన్నట్లు కథలు మాత్రమే ప్రచురిస్తాము వాటితోపాటు ఆయా రచయితల పేర్లు ప్రకటించడం జరుగదు బ్యాలట్ ఫలితాలతోనే కథకుల పరిచయం వుంటుంది.

# ఉత్తరాలు

ఫాలాక్షుని డైరీ

4—10—74 సంచికలో ఫాలాక్షుని డైరీలో (44 ఏపేజీ) సరస్వతీగిరిగారు ప్రత్యేక రైల్లో బెంగుళూర్ వెళ్లేరని రాశారు. అసలుకథ ఏమిటంటే ఆమె పరివారండిల్లీనుంచి బెంగుళూర్ వెళ్లేబోయింగ్ విమానంలో బయలుదేరారు. ఆ విమానం హైదరాబాద్ చేరేక చెడిపోయింది. శ్రీమతి గిరి, పరివారం సికింద్రాబాద్‌వద్ద ఉన్న హాకీంపేట మిలట్రీ విమానాశ్రయంకిపోయి అక్కడనుంచి ఒకప్రత్యేక ఎయిర్ ఫోర్స్ విమానంలో బెంగుళూరుచేరేరు.

పి. ఉమా మహేశ్వరరావు (హైదరాబాద్)

కథలు

"కోటివిద్యల్లో లేని కొత్త కూటి విద్య" నాకు బాగా నచ్చింది. రైల్వే ప్రయాణాల్లో జరుగుచున్న యదార్థ విషయాన్ని కళ్లకు కట్టినట్లు చూపించారు బలివాడ సత్యనారాయణరావు గారు. ఫిర్యాదులు చేసిననూ రైల్వే పోలీసులు నివారించ లేకపోతున్న ఈ చర్యలను రచయిత తమ రచన ద్వారా కొంతవరకైనా సాధించగల్గినందుకు యెంతేని అభినందనీయులు.

కొనకళ్ల రామ్మోహన్ (ఏలూరు)

* * *

'కథ మళ్లీ మొదటికి' బాగానే ఉంది కాని, తాడేపల్లిగూడెంలో కేటాయింపు (రిజర్వేషన్) పద్ధతి లేదు. శారద చిత్రం ప్రభాత్‌లో ప్రదర్శింపబడలేదు. 'బాబీ' ఇంతవరకూ ఈ వూరురాలేదు

సత్తి మోహన్‌రెడ్డి (తాడేపల్లిగూడెం)

* * *

"నాలుగు చపాతీల కోసం నగ్నంగా పరిగెత్తి దారుణంగా ప్రాణాలు పోగొట్టుకున్న వీరుడు ముత్తయ్య" ముత్తయ్య అలా పరిగెత్తడాన్కి కారణం...పిచ్చి, అదీగాక త్రాగిన సారాయి నిషా కావచ్చు. అప్పటికే బొచ్చె నిండుగా సారాయి వాడి ఆకలిని చంపేసి ఉంటుంది. అయినా కూడా కథాగమనం చాలా బాగా నడిచింది.

బాలప్రకాష్ ఫ్రెండ్స్ అసోషియేషన్స్
అలియాబాద్—(హైదరాబాద్)

ముఖ చిత్రం

నిత్య నూతన యువ్వన నటుడు అక్కినేని నాగేశ్వరరావుగారి ముఖచిత్రముతో వెలువడిన 11—10—74వ తేదీ సంచిక మమ్ములను ఎంతో ఆనందపరచింది.

యస్. విశ్వనాద్ (గుంటకల్)

* * *

మీరు నటీనటుల ముఖచిత్రాలను వారు బ్రతికి ఉన్నంతవరకే ప్రాధాన్యతనిచ్చి వేసినారు కాని ఇటు ప్రజల మన్నలను అటు ప్రభుత్వ బిరుదులను పొందిన కీ. శే. పద్మశ్రీ ఘంటసాల, పద్మశ్రీ నాగయ్యగారు' నటచక్రవర్తి ఎస్. వి. రంగారావు మున్నగు నటీనటులు మరణించిన తరువాత ఒకమారు కూడా వారి ముఖచిత్రాలను వేయకపోవడం మీ వ్యాపార దృష్టిని పాఠకులు ఏమనుకోవాలి ?

కె. సూర్యప్రకాశ్ (జనగామ్)

* * *

చల్లటి మనిషి, సెన్స్ ఆఫ్ హ్యూమర్, సంస్కారం వున్న సన్మిత్రుడు, తెలుగులో 'కాలమ్' రాయడంలో కొత్తదారులు తొక్కిన 'ప్రవీణు'డు.

తురగా కృష్ణమోహనరావు— **గాంధి పుట్టిన** రోజున 'కృష్ణా ఎక్స్‌ప్రెస్' ప్రారంభోత్సవానికి రైల్వే వారి 'వ్యాన్'లో వెళ్తూ ప్రమాదానికి గురి అయ్యాడు. విధి నిర్వహణలో మరణించాడు.

విధివైపరీత్యం!!

ఆయనతో పరిచయం వున్నవారెవరూ మరవలేని మనిషి ఆయన.

వాకాటి పాండురంగారావు,(విశాఖపట్నం.) ●

లోకంపోకడ * ఊమెన్
















# దసరా సరదాలు

**అంగీరస**

తొమ్మిది రోజులు జరిగే పండుగలు నవరాత్రాలు. ఇలాటి పండుగలు మనకు ముఖ్యంగా మూడు ఉన్నవి. సంవత్సరాదినుంచీ శ్రీరామ నవమి వరకూ జరిగే వసంత నవరాత్రోత్సవాలు మొదటిది. తర్వాత భాద్రపద శుద్ధ చవితినుంచీ వచ్చే గణపతి నవరాత్రాలు రెండవది. ఆశ్వయుజ శుద్ధ పాడ్యమినుంచి వచ్చే నవరాత్రాలు శరన్నవరాత్రాలు. ఈ మూడవ నవరాత్రాల్లో దేవీ పూజ ముఖ్యం కాబట్టి ఇవి దేవీ నవరాత్రాలని కూడా వాడుక. దేవీ నవరాత్రుల తర్వాతి దినమే విజయదశమి. అది [illegible]మైనదే! దాన్ని కలుపుకుంటే

దసరా అంటే వారికి ఎంతో సరదా. అవిచ్ఛిన్నంగా తొమ్మిది రోజులు వినోదించే పండుగ వారికి దసరాయే. ఇంటింటా బొమ్మల కొలువు పెట్టి, ప్రతిరోజూ ఏదో పిండివంట చేసి నైవేద్యం పెట్టడమూ, సాయంత్రం చక్కగా అలంకరించుకుని తమ

ఏమీ చెయ్యలేడు.

అందువల్లనే స్త్రీ దేవతలకే ప్రాధాన్యం. దుర్గా, సరస్వతుల ప్రాధాన్యానికి మరొక కారణాన్ని కూడా ఊహించవచ్చును.

శక్తితో — దుర్గాదేవితో కూడుకొని ఉన్నప్పుడే శివుడు ఏ ఘన కార్యాన్నయినా

భ్యాసం జరిగించడం సంప్రదాయం. ఆ సంప్రదాయం నేటికీ అవిచ్ఛిన్నంగా ఆదరించ బడుతూనే ఉన్నది.

కాని, ఆ పద్ధతిలో ఇప్పుడు కొంత మార్పు వచ్చింది.

పూర్వం పిల్లవాళ్లను గురువుల యిళ్లకు తీసుకుని పోయి అక్కడే అక్షరాభ్యాసం జరిగించేవారు

'ఫలక గ్రహణము చేపదముల గరిమంబుం
బరగె బాలకులకు గురువులిండ్ల'

అని పిల్లవాళ్లకు పలకలు పట్టించడం, గిలకల పద్యాలు చదివించడం గురువుల యిళ్లలో జరిగినట్లు తెనాలి రామకృష్ణ కవి





వింతగా ఉందే! ఈనాల అద్దె ఇవ్వడానికి విలు లేదంటే — కిక్కురు మనకుండా వెళ్లి పోతున్నాడే!!

శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ...!

దశ రాత్రు లవతాయి. దసరా అన్నది దశ రాత్రులవల్ల ఏర్పడినదే! తక్కిన నవరాత్రుల కంటే ఇదే దీనిలోని విశేషం!

ఈ నవరాత్రుల్లో దేవీపూజ జరుగుతుంది. దేవీ శబ్దానికి దుర్గా, లక్ష్మి, సరస్వతులు ముగ్గురూ అర్థమే! కాని, ఈ సమయంలో దుర్గాపూజ, సరస్వతీపూజ ప్రధానమైనవి. ఉత్తర దేశంలో దుర్గా పూజ ప్రధానం. దక్షిణాదిని శ్రీవిద్యోపాసకులు ఎంతో నియమంతో శ్రీలలితా మహాదేవి పూజను జరిగిస్తారు. బాలా, లలితాది దేవతా మంత్రోపాసకులు ఉపవాసముండి సహస్ర నామార్చనలు చేస్తారు. ఇతరులలో చాలామంది — శైవ, వైష్ణవ భేదం లేకుండా సరస్వతీ పూజ చేసి, రాత్రి అందరినీ ఆహ్వానించి, చందన తాంబూలాలు ఇచ్చి గౌరవిస్తారు. కథా కాలక్షేపాలు, వినోద ప్రదర్శనలు కూడా జరుగుతూ ఉంటాయి. పిల్లలకు ఇవి వేడుకగా ఉంటాయి

ఆడపిల్లలకు ఇది ముఖ్యమైన పండుగ. కొలువు చూడడానికి ముత్తయిదువులను ఆహ్వానించి, తాంబూలాదులతో సత్కరించడం పరిపాటి. కలిగినవారు ఆహ్వాన పత్రికలను అచ్చు వేయించి పంపడమున్నూ ఉన్నది. ఈ కొలువును ఒకరిని మించి ఒకరు అమర్చడం, రంగు రంగుల విద్యుద్దీపాలు నెలకొల్పడం జరుగుతుంది.

అందువల్లనే యిది పెద్దలకే కాకుండా పిల్లలకున్నూ ప్రధానమైన పండుగ అయింది.

బ్రహ్మకూ, శివునికీ ప్రాధాన్య మివ్వకుండా వారి గృహిణులు సరస్వతికీ, దుర్గకూ ఎందుకు ప్రాధాన్యం ఇవ్వాలి? అనే సందేహం కలగవచ్చును.

'గృహిణీ గృహ ముచ్యతే' — అని గృహానికి గృహితో ఉండే సంబంధం కంటె గృహిణితో వుండే సంబంధమే ఎక్కువ. ఇంటిని సరిదిద్ద వలసినదీ, అతిథ్యభ్యాగతులను గౌరవించ వలసినదీ గృహిణియే! ఆమె సమ్మతి లేనిదీ ఏ పనీ జరగకూడదు. ఆమె యిష్టానికి విరుద్ధంగా గృహ యజమాని సాధింపగలడు. లేకపోతే ... ... సాధ్యం కాదు.

'శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ... ...' అని ఆది శంకరులే సెలవిచ్చారు. భృగుమహర్షి శాపంవల్ల బ్రహ్మదేవుడికి పూజా పురస్కారాలు లేకపోయాయి.

శత్రు విజయాన్ని కోరే రాజులు పూర్వం నవరాత్రులూ దుర్గాదేవిని పూజించి, ఆమె అనుగ్రహాన్ని పొంది, విజయ దశమినాడు విజయయాత్రకు బయలు దేరేవారు. విజయదశమి అనే పేరు రావడానికి ఈ విజయ యాత్ర కారణమయితే కావచ్చు.

తొమ్మిది రోజులూ సరస్వతీ పూజ జరిపినా జరపవచ్చు. లేదా — మూలానక్షత్రం వచ్చిన దినం ఆవాహన చేసి, శ్రవణనక్షత్రం చివర ఉద్వాసన చేయవలసి ఉంటుంది. అవే ముఖ్యమైన రోజులు!

'మూలే చావాహయే ద్దేవీం
శ్రవణాంతే విసర్జయేత్'

అని మన పెద్దల యేర్పాటు.

ఈ విధంగా సరస్వతీ పూజ జరిపిన తర్వాత 'విద్యారంభం కరిష్యామి' అన్నట్లుగా — శిశువులకు విజయదశమినాడు అక్షరా తెలుపుతున్నాడు.

రాజులుకూడా తమ చిరంజీవుల విద్యాభ్యాసం కోసం తమ భవనాలకు దూరంగా లిపిశాలలు, విద్యా మందిరాలు కట్టించి, అక్కడికి గురువులను రప్పించి, అక్కడే విద్యాభ్యాసం జరిగించేవారు.

లలిత విస్తరం మొదలగు ప్రాచీన గ్రంథాల వల్ల ఈ విషయం తెలుస్తున్నది. గురువులను తమ యిళ్లకు రప్పించే పద్ధతి లేదు.

ఇప్పుడో ఆ పద్ధతి తారుమారయింది. గురువులే వారి వారి యిళ్లకు పోయి పలకలు పట్టించడం జరుగుతున్నది.

గురుకుల వాసమనే మాటకు అర్థం లేక పోయింది.

సంప్రదాయం మారినా, సంప్రదాయ మనేది వుంటూనే ఉన్నది.

బాలకులకు దసరా పద్యాలు చదవడం, పలకలు పట్టడం, పప్పుబెల్లాలు తినడం ఎంతో సరదా.

బాలికలకు బొమ్మల కొలువు పెట్టడం, వేడుకలు జరపడం చాలా సరదా.



బొమ్మలు.

రకరకాల బొమ్మలు. రంగు రంగుల బొమ్మలు.

కొన్ని కొండపల్లి బొమ్మలు. మరి కొన్ని మైసూరు చందనం బొమ్మలు. ఎన్నో పింగాణి బొమ్మలు. దక్షిణ దేశం నుండీ, రాజస్థాన్‌నుండీ ప్రత్యేకంగా తెప్పించిన రంగు రంగుల బొమ్మలు. అన్నీ కళాఖండాలు. తయారు చేసినవారి కళాకౌశలంతోపాటు, సేకరించినవారి కళాహృదయాన్ని వెల్లడిచేసే బొమ్మలు.

ఓ పెద్ద బల్లమీద దేవుడి ఊరేగింపు సెట్టు. గరుడవాహనారూఢుడై స్వామి కన్నుల పండువు చేస్తున్నాడు. మంగళ వాద్యాలు మోగిస్తూ ముందు సన్నాయి మేళగాళ్ళూ, వేదమంత్రాలు వల్లిస్తూ వెనక నామాల స్వాములూ నడుస్తున్నారు. చుట్టూ పూజా ద్రవ్యాలు పళ్ళెరాల్లో పెట్టుకొని స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ.

మరో బల్లమీద రాసలీల సెట్టు. పొన్న చెట్టు కానుకొని వేణుగానం చేస్తున్న చిన్ని కృష్ణుడు. చుట్టూ అరమోడ్పు కన్నులతో భక్తి పారవశ్యంలో శరీరాల్నే మరచి నృత్యం చేస్తున్న గోపికలు. సాక్షాత్తూ బృందావనమే భూమికి దిగివచ్చినట్లుంది. బల్లమీద మరో వైపు శకుంతలను దుష్యంత మహారాజు దగ్గరకు పంపుతున్న కణ్వమహర్షీ, శిష్యులూ, అనసూయా ప్రియంవదలు, ఎంతో ప్రేమతో పెంచిన జింకపిల్లను వొదిలి వెళ్ళటానికి కాళ్ళురాని శకుంతల కళ్ళల్లో ఆవేదన, కాళిదాసు వర్ణించిన ఘట్టానికి కమనీయ మైన రూపకల్పన. ఆ శిల్పి ఎవరో నిజంగా ధన్యుడు.

మరో చిన్న బల్లమీద విశ్వామిత్ర తపో భంగమూ, శివధనుర్భంగమూ, గంగావతరణం, కామదహనం మొదలైన పురాణ ఘట్టాలను తెలియచేసే బొమ్మలు.

ఓ చిన్న అద్దాల బీరువాలో మహాత్మా గాంధీ, రామకృష్ణ వివేకానందులూ, షిర్డీ సాయిబాబా, రమణమహర్షి మొదలైన మహా పురుషుల ప్రతిరూపాలు.

ఫ్లోరా ఫౌంటెన్.

రంగు రంగుల దీపాల కాంతిలో సన్నని జలధార పడుతూంది. చాలా ఆహ్లాదకర మైన దృశ్యం. ఎంతసేపు చూసినా తనివి తీరడంలేదు.

రాజేశ్వరమ్మగారింట్లో బొమ్మల్ని రెప్పార్ప కుండా చూస్తున్నారు మహిళలు. రాజేశ్వ రమ్మ చిరునవ్వు నవ్వుతూ అడిగిన వాళ్లంద రికీ వివరాలు చెప్తున్నది.

"ఈ బొమ్మ ఖరీదెంతండీ ?" అంటూ అమాయకంగా అడిగింది మీనమ్మ.



"దాని ఖరీదు నూటయాభై. ఆఫీసు పని మీద మా వారు ఢిల్లీ వెళ్లినప్పుడు తెచ్చారు బావుందా?" అంది రాజేశ్వరమ్మ నవ్వుతూ.

"చాలాబావుందండీ, అబ్బో! అంత ఖరీదే పాతికో పరకో వుండొచ్చని నే ననుకున్నాను" సమాధానం చెప్పింది తన తెలివితక్కువ తనానికి మనసులో నొచ్చుకుంటూ.

అందరూ గలగల నవ్వారు.

రాజేశ్వరమ్మ భర్త మధుసూదనరావు విశాఖపట్నం నుండి ట్రాన్స్‌ఫరై ఆ వీధిలో ఓ పెద్ద ఇల్లు అద్దెకు తీసుకొని కొత్తగా కాపురం పెట్టారు. మధుసూదనరావుగారికి రెండక్షరాల ఉద్యోగం. నాలుగంకెల జీతం. ఆ రోజు శ్రావణ శుక్రవారం. ఆవీధిలో మహిళల సందర్భీ పరిచయం చేసుకొందామని అందర్నీ పేరంటానికి పిలిచింది రాజేశ్వరమ్మ. అసలు రాజేశ్వరమ్మకు చిన్నప్పట్నించీ బొమ్మలంటే విపరీతమైన పిచ్చి. పెరిగి పెద్దయ్యాకకూడా రక రకాల బొమ్మల్ని సేకరించడం హాబీగా పెట్టుకుందామె. ఆఫీసుపనిమీద మధుసూధనరావు దేశంలో దాదాపు అన్ని రాష్ట్రాలకూ వెళ్తుండేవాడు. తిరిగొచ్చేటప్పుడు కళాత్మకంగా కంటికి కనిపించిన బొమ్మల్ని భార్య కోసం తెచ్చేవాడు. బొమ్మలన్నింటినీ బహు జాగ్రత్తగా అమర్చి, వాటిని అలాగేచూస్తూ గంటల తరబడి కాలం గడిపేది రాజేశ్వరమ్మ.

"రాజేశ్వరమ్మగారూ! మాదో చిన్నకోరిక" అడిగింది పార్వతమ్మ.

"ఏమిటీ?" అంది రాజేశ్వరమ్మ నవ్వుతూ.

"మీ ఇంట్లో బొమ్మల్ని ఎంతసేపు చూసినా తనివి తీరడంలేదు. మరో మారొచ్చి తీరికగా చూస్తాం. ఇక వెళ్తాం"

"ఓ! అలాగే" అంటూ రాజేశ్వరమ్మ లోపలికెళ్లి ఓ పెద్ద వెండి పళ్లెంలో పళ్ళూ, తాంబూలాలూ, జాకెట్టుగుడ్డలూ పట్టుకొచ్చి, నొసట బొట్టుపెట్టి అందరికీ తాంబూలా లిచ్చింది, తాంబూలాలు పుచ్చుకొని అందరూ వెళ్లిపోయారు.

"అదృష్టమంటె రాజేశ్వరమ్మగారిదే అదృష్టం. మొగుడికి నెలకు వెయ్యిరూపాయల జీతమట. ఇంట్లో లక్ష్మి తాండవమాడక ఏం చేస్తుంది' అంది మీనమ్మ దోవలోపార్వతమ్మ వొదినతో.

"పూజకొద్దీ పురుషుడూ, దానం కొద్దీ బిడ్డలే పిచ్చిదానా. మనకూ ఉన్నారు తుమ్మ మొద్దుల్లాంటి మొగుళ్ళు. ఏం లాభం, ఖర్మ

**బాబోయ్** —డా॥ సి. నారాయణరెడ్డి

| | |
|---|---|
| "రంకెలు | "నిట్టూర్పులు |
| రణగొణ ధ్వనులు | నిశ్శబ్దాలు |
| రక్కసి ముళ్లు | మంచు గడ్డలు |
| రక్తపాతాలు | చీకటి గద్దలు |
| వడదెబ్బలు | కీళ్ల వంకర్లు |
| పెడబొబ్బలు | కాళ్ల కొంకర్లు |
| ధూమం ధూళి | మాంద్యం మైకం |
| తుక్కూ దూగర | మట్టీ జిడ్డూ |
| భరించలేను భరించలేను | భరించలేను భరించలేను |
| బాబోయ్ వెళ్లిపోతాను." | బాబోయ్ బయటి కొస్తాను." |
| సగటుజీవి వెళ్లిపోయింది | సగటుజీవి వచ్చేసింది |
| సమాధి లోనికి. | సమాధిలోనుంచి. |

కాలి ఎప్పుడైనా సినిమా కెళ్తామంటే ఖస్సుమంటారు." అంది పార్వతమ్మ మొగుళ్ల సందర్నీ జాయింటుగా కలిపి తిడుతూ.

నాలుగైదు రోజుల తర్వాత వొక సాయంత్రం పని మనిషిని వెంట బెట్టుకొని ఆ వీధి చివర కాపుర ముంటున్న కనకదుర్గ గారింటికి వెళ్లింది రాజేశ్వరమ్మ. బాగా చీకటి పడ్డాక ఇంటికి తిరిగి వెళ్తున్నప్పుడు "రండి రండి" అంటూ రోడ్డుమీద వెళ్తున్న రాజేశ్వరమ్మను ఆహ్వానించింది మీనమ్మ. రాజేశ్వరమ్మ చిరునవ్వు నవ్వుతూ మీనమ్మ ఇంట్లో అడుగు పెట్టింది.

"కూర్చోండి" అంటూ చాప పరిచింది మీనమ్మ.

రాజేశ్వరమ్మ చాప మీద కూర్చుని ఇల్లంతా కలయ చూసింది. చాలా చిన్న ఇల్లు. ఇంట్లో ఫర్నిచరూ, తదితర సామగ్రి అంతంత మాత్రంగానే వుంది ... గోడలకు ఏవేవో పాత కాలెండర్లు వ్రేలాడుతున్నాయ్. వంటగదిలో మీనమ్మ పెద్ద కూతురు సుశీల చిన్న పిల్లలకు అన్నం పెడుతున్నది. కంచాల ముందు ఇద్దరు ముగ్గురు పిల్లలు కూర్చొని నానా హంగామా చేస్తున్నారు. ఐదారేళ్ల అబ్బాయి కంచంముందు నుంచి లేచి రెండు వేళ్లు చూపిస్తూ సుశీలతో ఏదో చెబుతున్నాడు. "ఛా! వెధవా" అంటోంది సుశీల. పన్నెండేళ్ల అబ్బాయి హరికేన్ లాంతర ముందు కూర్చుని పాఠాలు చదువుకుంటున్నాడు. మరో చిన్న పాప వచ్చీ రాని పాట పాడుతూ డాన్సు చేస్తున్నది. పిల్లలందరూ ఆరోగ్యంగా, బొద్దుగా, ముద్దుగా, రబ్బరు బొమ్మల్లా ఉన్నారు.

"చస్తున్నానంటే ఈ పిల్లలతో వేగలేక. వెధవ కొట్లాటలూ వీళ్ళూను" అంది మీనమ్మ రాజేశ్వరమ్మకు కాఫీ అందిస్తూ.

రాజేశ్వరమ్మ కాఫీ చప్పరిస్తూ నవ్వింది.

"మీ ఇంట్లో బొమ్మలన్నీ చాలా బాగున్నాయండీ! బొమ్మల్ని చూపమని మా పిల్లలు నా ప్రాణాలు తోడేస్తున్నారు" అంది మీనమ్మ. కాఫీ కప్పు కిందపెట్టి పిల్లల వైపు మరోసారి చూసింది రాజేశ్వరమ్మ. అప్రయత్నంగా ఆమె కళ్లు చెమర్చినై. నిజమే. తన ఇంట్లో బొమ్మలన్నీ చాలాఖరీదైనవే. అపురూపమైనవే. కానీ వాటిల్లో ప్రాణంలేదు, అవన్నీ నిర్జీవ ప్రతిమలు. మీనమ్మ ఇంట్లో బొమ్మలు అమూల్యమైనవి. పైగా జీవకళ ఉట్టిపడుతూ చైతన్యంతో కళకళ లాడుతున్న బొమ్మలు. తనకు సంతానం లేదు. గంపెడు బిడ్డలతో కాపురం చేస్తున్న మీనమ్మ నిజంగా ఎంత అదృష్టవంతురాలు!

"అలాగే! పిల్లలనందరినీ వెంటబెట్టుకొని రేపు తప్పకుండా రండి. కానీ మాదో చిన్న కోరిక. మా ఇంట్లో బొమ్మల్ని నేను చూపిస్తాను. అలాగే మీ ఇంట్లో బొమ్మల్ని కనీసం వారానికి రెండుసార్లు మీరు నాకు చూపించాలి. లేదా నేనే స్వయంగా మీ ఇంటి కొచ్చి చూస్తాను." అంది రాజేశ్వరమ్మ లేస్తూ.

బుర్ర గోక్కుంటూ అలాగే నిలబడి పోయింది మీనమ్మ రాజేశ్వరమ్మ మాటల కర్థాలు వెతుకుతూ.

సుబ్బారావ్ సిగరెట్ కాలుస్తూ, భార్యామణి రాకకోసం చూస్తూ పడుకొన్నాడు.
లలిత రానే వచ్చింది. పతి చెంతకు రాకుండా బీరువా చక్కబెడుతోంది.

"ఏం! లతా అర్ధరాత్రివేళ బీరువా దేనికి?" అంటూ లేచి కూర్చున్నాడు.

సుబ్బారావ్‌కి పెళ్ళాన్ని ముద్దుగా, మధ్య అక్షరాన్ని తీసేసి "లతా" అని పిలుస్తూంటాడు. లేకపోతే ఇప్పటినుంచీ పిల్లలైనా పుట్టిందే, లలిత, లలితమ్మ అంటూ పిలిస్తే మోటుగా ఉంటుందని అతగాడి అభిప్రాయం. పూర్తిగా పేరు మార్చేసేవాడే. అత్తారు ఏడ్చిపోతారని ఊర్కొన్నాడు.

"రేపే కందండీ! పండగ. క్రొత్త బట్టలకి బొట్లూ అదీ పెడదామని."

"అహా... పోనీ అవి తీసుకుపోయి బాత్ రూమ్‌లో పెట్టుకుని రాకూడదూ? ప్రొద్దుట అంతపని ఉండదూ!"

"ఏం వేళాకోళంగా ఉందీ! మీకేం? ఎన్నయినా చెబుతారు. పండగంటే ఆడాళ్ళు పొయ్యిదగ్గర కూర్చుని ఏడ్వడమేగా!"

"అవునవును! నిరుడు పండగకి మీ అమ్మ పొయ్యిదగ్గర కూర్చుని, కళ్ళు ఒత్తుకోడం నేనూ చూసాను."

"ఏ పొగో వచ్చి కళ్ళు తుడుచుకుందేమో? పోనీలెండి. అందుకేగా ఈసారి వెళ్ళనివ్వలేదు." అంటూ వచ్చి అటువైపు తిరిగి పడుకుంది, తనకు అలకవచ్చినట్టు సూచిస్తూ.

"పండగ రోజుల్లోకూడా అలకేమిటి? కాస్త ఇటుతిరిగి మాట్లాడుదూ."

"పండగ రేపుకదా! చూద్దాంలెండి."

"ఓహో అట్లాగా! ఇంకో మంచమయినా కొనుక్కురానేమిటి? నీకైనా, నాకైనా కోపం వచ్చినపుడు ఉపయోగిస్తూఉంటుంది. లేకపోతే ఏ పిల్లాడినో కనేస్తేసరి వేరే మంచం పోస్తుంది."

ఆ విట్టుతోనైనా నవ్వేస్తుందనుకున్న సుబ్బారావ్‌కి నిరాశే కలిగింది.

లేచి అలారం వాచీకి కీ ఇస్తూ కూర్చుంది.

"ఇదిగో లతా! అలారం దేనికి. మనం ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పుకునేసరికి ఏ ఒంటిగంటో అవుతుందా! అప్పటి నుండి మొదలు పెట్టేద్దువుగాని పిండివంటలు."

"నేను ఏ కబుర్లూ చెప్పదల్చుకోలేదు, విన దల్చుకో లేదు." అంటూ వచ్చి పడుకొంది.

దేవిగారి అలక రేపు వంటగదిలో కష్ట ప వేగా.




అదేంకాదుగాని, నన్ను నిద్రపోనివ్వండి.

"మరి, మరి లతా ఇటు తిరుగు. నీకో మాంచిమాట. అంటే పండగరోజు ఎట్లా గడపాలో నే చెపుతాగా!"

"నేనేం చెవులు మూసుకోలేదు చెపితే చెప్పండి."

"అది కాదు లతా! పండగంటే చక్కగా, భార్యా భర్తలిద్దరూ చేట్టా పట్టాలేసుకుని షికార్లుకొడుతూ..."

"కడుపులో మాడ్చుకుంటూ" అంది లలిత ఇటు తిరుగుతూ.

ఆవిడబాధ అది పాపం. అవును మరి. పండగంటే నాలుగు పిండివంటలు, ఆరు కూరలూ చెయ్యాలంటే మాటలా. ఇంక క్రొత్తబట్టలు కట్టుకొనే తీరుబడి ఎక్కడ. మళ్ళీ మధ్యాహ్నం కాఫీ, టిఫిన్‌లు,సాయంకాలం వంట. ఒహటే పండగ. మరి పుట్టింటికైనా వెళ్ళ నివ్వలేదు సుబ్బారావ్. ఇటు తిరగ్గానే సుబ్బారావ్‌కి చాటంత మొహం అయింది.

"నే చెప్పేది పూర్తిగా వినవేం? రేపు నువ్వేమీ తొందరగా లేవనక్కరలేదు. ఏడు గంటలకు లేద్దాం. లేచి పొయ్యి అంటించ నక్కర్లేదు. మర్చిపోయాను, అంటించాలి. చన్నీళ్ల స్నానం చెయ్యలేం కదా! నీళ్ళు ఒక్కటే కాగితే చాలు. ఆ తరువాత స్నానాలు చేసేద్దాం."

"సరిగంగ స్నానాలా" నవ్వాపుకుంటూ అడిగింది లలిత.

"ఆ...నాకేం అభ్యంతరం లేదు, నీ కిష్టమయితే.తరువాత కొత్తబట్టలు వేసేసుకొని"

"అయ్యయ్యో! పరగడుపున క్రొత్త బట్టలు వేసుకోకూడదండీ".

"పోనీ ఏం తిందాం? ఇంట్లో ఏమీ లేవాయే! కాస్త పంచదార నోట్లో వేసుకుంటే పోలా?".

"అలానే చెయ్యొచ్చు గాని చెప్పేది తొందరగా కానివ్వండి."

"అదేనే, ఇద్దరం టాయ్‌లెట్టయిపోయి బస్సుస్టాండు దగ్గరకు— రిక్షా ఎందుకులే పావలా దండగ. సర్దాగా నడిచి వెళ్లచ్చు—సిటీ బస్సెక్కి మన సత్యం పూలతోటకి వెళ్దాం. తోవలో కాఫీ టిఫిన్ తీసుకుందాంలే! తోటలో హాయిగా జల్సాగా యుగళ గీతాలు పాడుకోవచ్చు. సత్యం లేడు అత్తారింటికి పోయాడు. అనంతరం బజారు కెళ్లడం."

"దేనికి"

"అదేనే! నీకు ఏమేం కావాలో అన్నీ తీసుకోవచ్చు. ఒక పెద్ద బొమ్మ కూడా కొందాం. నేను మొన్న చూసాలే! చాలా ముద్దుగా ఉంది. నువ్వు ఎదిరింటి పాపనీ, పక్కింటి బాబునీ ఎత్తుకుంటున్నావుగా! బొమ్మయితే ముద్దొచ్చినప్పుడు ఎత్తుకోవచ్చు, పని ఉన్నపుడు డ్రాయరు మీద పడవేయ వచ్చు. దానివల్ల రాత్రులు కూడా మనకేమీ ఇబ్బంది ..."

"ఛ ... ఊరుకోండి. ఎవరైనా వింటారు?"

"మీ ఆడాళ్లకి ఇదో అలవాటు. మనం తప్ప ఈ ఇంట్లో ఎవరున్నారు వింటానికి?"

"మీతో మాట్లాడలేను బాబూ."

"సరే! మాట్లాడవద్దు. నే చెప్పేది విను. తరువాత మంచి హోటల్లో ఫూటుగా భోంచేసి రెండు కిళ్లీలు తీసుకొని..."

"రెండు కాదు నాలుగు"

"నాలుగు దేనికి?"

"మొదట వేసుకున్నవి పండకపోతే, ఉపయోగిస్తాయని!"

"చాల్లే ... చాపు తెలివి. అందుకే, నిన్ను మాట్లాడవద్దన్నా. నా ఫ్రెండు రాజు లేడూ! వాళ్లింటికి వెళ్దాం. రోజూ రమ్మని వాడు గోల చేస్తున్నాడు. వాడికీ పిల్లాజెల్లా లేరు కాబట్టి ఇల్లేం సత్రవులా ఉండదు. సర్దాగా నలుగురం కేరమ్సో, పేకో, ఆడుకొని తదనంతరం బీచికిపోయి ప్రేమ పక్షుల్లా విహరించి తిరిగి అత్మారాముడిని శాంతింపజేసి, పిక్చరు చూసి స్వీటులు కొనుక్కొని పండగ పేరు చెప్పి ఇంటి దగ్గర తినేందుకు కూడా. ఒక శేరు మల్లెపూలు తీసుకొని బస్సెక్కి ఇంటికి చేరడం! ఎల్లా ఉంది? పండుగరోజు" బరువు దిగిపోయినట్టు ఊపిరి తీసుకున్నాడు. సుబ్బా వు.

"బాగానే ఉంది. కాని అన్ని మల్లెలు దేనికండీ ? నా జడ విగ్గు కాదే భరించ టానికి ?"

"అబ్బే నీ జడ మోస్తుందని నేను మాత్రం అన్నానా ? పోనీ మన మంచం సాయం చేస్తుందేమోనని !."

"అదా స్వామీ ! ఎత్తుగడ ! బాగానేఉంది గానీ, ఏమాత్రం కేష్ ఉందేమిటి ఖర్చు పెట్టటానికి ?"

"మీతో వచ్చిన చిక్కే ఇది. మొగాడు ఖర్చుచేస్తే అంతా అయిపోతోంది. ఏమి మిగల్చటం లేదు అంటారు. ఊరుకుంటే, ఒక సినిమా లేదు, ఒక చీర లేదు, అంటూ మొదలు పెడ్తారు ! ఎట్లా చచ్చేది?"

"ఎట్లా అంటే ఈ మధ్య అతి తెలివి పరులు చెవిలో ఎం(డిన్ పోసుకుని చస్తు న్నారు. నోటితో మింగలేక."

"అంటే, ఆ మాట నన్నేకదూ నువ్వు అనేది ?"అంటూ కోపంగాలేచి కూర్చున్నాడు సుబ్బారావు.

"ఛ. ఛ. మిమ్మల్నెందుకంటానండీ పెళ్ళాంతో వేగలేక, చచ్చేవాళ్లని గాని ! అది సరే ! మనం ఇట్లా ఖర్చు చేసేస్తే, రేపు పుట్టబోయే వాళ్లకి ఏం మిగుల్చుతారట?"

"పుట్టబోయే పిల్లలమాటా నువ్వనేది? ఓహో...వాళ్లు పెరిగి మనల్ని ఉద్ధరిస్తారా? నువ్వే చూడు ! ఏం చేసావు ? మీ అమ్మా వాళ్లు పండగకి రమ్మని (పేమగా ఉత్తరం (వాసారా? పెళ్లయి రెండేళ్లవలేదు. అప్పుడే 'మా వారు వెళ్లద్దంటున్నారు' అంటూ ఉత్తరం (వాశేసేవు. నేను వెళ్లొద్దు అన్నానే అనుకో, అయితే మాత్రం వాళ్ళ తరపున కూడా ఆలోచించి నన్ను (బతిమాల వద్దా? ఇక నేనంటావా ! మా వాళ్ళు, అసలు గుర్తు రావటం లేదు !"

"బాగుంది మీ వరస. అలా మన తల్లి దం(డులు అనుకుని ఉంటె, మనం పెరి గామే !"

"నేనుమాత్రం ఏమన్నాను ? మనం అంత కళ్లు మూసుకుని ఖర్చు పెడతామా? ఏదో పండగ రోజు ! అది సరేగాని ఆ అలారం కాస్త చూడు. బంగారంలాంటి ని(ద పాడు చేయగలదు "

"అవును! మర్చేపోయాను" అంటూ లేచింది లలిత.

సుబ్బారావు ని(దపోయినా లలితకి ని(ద రావటంలేదు. "పుట్టింటి దగ్గర మేము వెళ్లనందుకు ఏమనుకుంటున్నారో ? పోనీ ఇక్కడ పండగ ఎంత సర్దాగా చేసుకున్నారో వివరంగా ఉత్తరం (వాయాలి. అది చూసి అంతా సంతోషిస్తారు. అమ్మ మాత్రం 'పండగపూట హోటలు భోజనం ఏమి'టని బాధపడుతుందేమో?" అంటూ ఆలోచిస్తూ ని(దలోకి జారుకుంది లలిత.

వంట ఇంటి పని మెదడులో లేనందున ఏడున్నరదాకా ని మెలకువ రాలేదు లలితకి. అదరా బదరా సుబ్బారావుని లేపి, కాలకృత్యాలు తీర్చుకొని (కొత్త బట్టలు వేసుకొని, ఇంటికి తాళం పెట్టేసరికి ఎనిమిదిన్నరయింది. తొందరగా బస్ స్టాప్ చేరుకున్నారు.

"అదిగో, అక్కడ హోటల్ ఉందండీ. బస్సొచ్చేలోపున కాఫీ తీసేసుకుంటే!"

"ఆ హోటల్ లోనా ఇంకా నయం.



## నటీనటులు కావలెను

మాచే త్వరలో నిర్మించబడుతున్న వర్ణ చిత్రంలో నటించుటకు చక్కటి అంద చందాలు కలిగి,నాటకానుభవం కలిగిన యువతీ, యువకులు కావలెను. చిత్ర నిర్మాణం జనవరి 1975 లో ప్రారంభింపబడుతుంది. ఆశక్తి గలవారు తమ పాటో ఇతర వివరాలతోసహా ఈ క్రింది ఇవ్వబడిన అడ్రసుకు దరఖాస్తులు పంపగోరుచున్నాము.

సేవాసదన్ ఎంటర్ ప్రైజెస్
మెయిన్‌రోడ్, విశాఖపట్నం—1.

---

పాల్కురికి సోమనాథుని

## బసవ పురాణము

(ద్విపద కావ్యము)
ఆంధ్ర గ్రంథమాల
ప్రచురణ

బైండు చేసిన రంగుల అట్టతో, కీ.శే. కాశీనాథుని నాగేశ్వరరావుగారి 'ప్రస్తావన'తో, శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి విపుల పీఠికతో అమ్మకానికి సిద్ధంగా ఉంది.

**వెల రు. 7-50**

పాఠకులు ఆంధ్రపత్రిక ఏజంట్ల ద్వారా ప్రతులని కొనుక్కోవచ్చు.

మేనేజరు,
ఆంధ్రపత్రిక, 7. తంబుశెట్టి వీధి,
మద్రాసు—1.

---

## పండుగరోజు

అందులో టిఫిన్‌ల ముందు, నీ చేతివంటకాలే బాగుంటాయి."

"అంటే అర్థం? నేను బాగా చెయ్య ననేగా!"

"అర్థాలమాట తరువాత. ముందు బస్సు వస్తోంది. నడు" అంటూ తొందరగా భార్యను ఎట్లాగో లోపలకు నెట్టి తనూ ఎక్కాననిపించాడు. మెట్ల మీద నిలబడి "వెధవ సిటీ బస్సులు. లోపలికి వెళ్లడాని క్కూడా చోటు లేందే! వీటికి సీటర్సు దేనికి? దండగ. శుభ్రంగా ఖాళీగా ఉంటే ఎక్కువ మంది నించోవచ్చు. అప్పుడు కూర్చున్న వాడిని చూసి నించున్నవాడు ఏడ్చే బాధ తప్పుతుంది" అక్కసుగా అనుకు న్నాడు సుబ్బారావు అరగంటా ఓపిగ్గా నిలబడి తమ స్థానం వచ్చేసరికి దిగిపోయారు లలితా, సుబ్బారావులు.

"ఏమండీ! పువ్వులు కొనుక్కుంటా! ఒక పావలా ఇవ్వండి!" పువ్వుల కొట్టుకేసి చూస్తూ అంది లలిత.

"కాఫీ తీసుకుని పువ్వుల తోటలోకేగా వెళుతూంట ఇంకెందుకూ దండగ!."

"అది కాదండీ! ఈ లోపున, వాలుజడ లోకి, పువ్వుల్లేకపోతే బావుండొద్దూ!."

"నా దగ్గర చిల్లర డబ్బులు ఇందాక టిక్కట్లు తీసేసాను."పండగ మల్లే భార్యను చిన్నబుచ్చడమెందుకని జేబులో చెయ్యి పెట్టిన సుబ్బారావు "లతా! ప... పర్సు లేదేమిటి?" అన్నాడు నీరు కారిపోతూ.

"లేదా! ఇంటి దగ్గర మర్చిపోయారా?" ఆదుర్దాగా అడిగింది లలిత..."

"అబ్బే ఎవడో కొట్టేసేడు" చిల్లు జేబు చూపించాడు.

"అయ్యయ్యో! ఎంతడబ్బు పెట్టారు? ఆ వెధవ బస్సులోనే కొట్టేసుండాలి. ఇప్పుడెలాగండీ?"

"గట్టిగా అరవకు. నలుగురికి తెలిస్తే సిగ్గుచేటు. పండుగనాడు మన ఖర్మ ఇలా కాలింది ఏం చేస్తాం! ఇంటికి పద."

"ఏమిటీ? మైలున్నరా నడిచి వెళ్లడమే?" తేలగుడ్లు వేసింది లలిత

"ఏం చేస్తాం? తొందరగా నడు. కడుపులో ఎలుకలు దొలుస్తున్నాయి."

నీరసంగా ఇంటిముఖం పట్టారు సుబ్బారావు దంపతులు.

---

## వంటలు

### చెక్క వడలు

కావలసిన వస్తువులు :-

కావలసిన వస్తువులు : బియ్యంపిండి ఒకకిలో, గోధుమపిండి అర్ధకిలో. సెనగపప్పు అర్ధపావు, పెసరపప్పు అర్ధపావు, నువ్వులు అర్ధపావు, ఉప్పు కారము తగినంత

చేయవలసిన విధానము మనము యీ పిండివంట చెయ్యాలనుకునేటప్పుడు, ముందుగా, పైన చెప్పిన ప్రకారము సెనగపప్పునూ, పెసరపప్పునూ నానపోసు కోవాలి. అవి నానిన తరువాత, గోధుమపిండీ, బియ్యం పిండీ, యీ నానిన పప్పులూ, నువ్వులూ, అగినంత ఉప్పు, కారము, వేసి బాగా కలపాలి. అవి బాగా కలిసిన తరువాత, నీళ్లుపోసి, (అంటే మనము రొట్టెలు వత్తుకునే పిండిలాగా) ముద్దగా, గట్టిగా కలపాలి. తరువాత స్టౌమీద బాణలిపెట్టి, బాణలో సగమువరకు (అంటే, మనము వేసిన వడలు మునిగేటట్లుగా) నూనె పోసి, అది కాగే లోపల, మనము కలుపుకున్న ముద్దని చిన్న చిన్న ఉండలుగా చేసుకుని, ఒక ప్లాస్టిక్ కాగితం మీద కానీ, అరిటాకు మీదకానీ, యీ ఉండలను ఒక్కొక్కటే నూనె చెయి చేసుకుని, పల్చగా, అప్పడము లాగా వత్తాలి. (నూనె చెయ్యి చేసుకుని, వత్తడమువలన ఆ అప్పడము సులభముగా తియ్య టానికి వస్తుంది) దానిని కాగ్గ ఎర్రగా వేగే వరకూ వేయించాలి. అవి చల్లారాకా తింటే, బాగుంటాయి. ఇది పెద్ద పిండి వంటయినా, చాలా కాలం పాడవకుండా, కరకరలాడుతూనే ఉంటాయి. నూనె అస్సలు పీల్చదు.

—జి. రామలక్ష్మి

---



# సక్రమంగా వాడితే వున్నంత ఎరువులతోనే - అధికదిగుబడులు సాధ్యం!

నిస్పృహ చెందకండి !
ఎరువులు తక్కువగా వాడినంత మాత్రాన ఎక్కువ దిగుబడులు సాధ్యంకావని నిరాశచెందకండి.

ప్రాంతానికి తగ్గ రకాలు ఎన్నుకొని, తగిన సాగుపద్ధతులు అవలంభించి సక్రమమైన పంట మార్పిడితో, ఎరువులు కాస్త కొరవైనా ఎక్కువ దిగుబడులు పొందగలరనడంలో అతిశయోక్తిలేదు.

ప్రపంచమంతటా సంభవించిన ముడిపదార్థాల కొరతవల్ల రోజురోజుకు అన్నింటితో సహా ఎరువుల ధరలు కూడా పెరుగుతూన్న ఈకాలంలో సమర్థవంతమైన ఎరువుల వాడకం మాత్రమే వ్యవసాయాన్ని లాభదాయకంగా చేయగలదు.

ఇది ఎలా సాధ్యం ?

ఉన్న ఎరువులను సక్రమంగా వాడకపోతే వాటి ఫలితం 100 కి 30 పాళ్లే. అవే ఎరువులను సమర్థవంతంగా వాడినపుడు వాటి ఫలితాన్ని 100కి 100 పాళ్ల వరకూ పెంచవచ్చు !

ఎట్లనగా,

**1** సాగుచేసే పొలానికి అవసరమైన పోషక పదార్థాలను మాత్రం పైరును బట్టి నిర్ణయించండి ఇందుకు భూసార పరీక్ష చేయించండి.

**2** సేంద్రియపు ఎరువులను వీలైనంత ఎక్కువగా వాడండి. వీటివల్ల రసాయనిక ఎరువుల ఫలితం పెరగడమే కాక నేల యొక్క భౌతిక లక్షణాలు కూడా బాగుపడతాయి.

**3** అవసరాన్నిబట్టి సూక్ష్మ పోషక పదార్థాలను కూడా వాడండి.

**4** సాగుకు అనువైన భూముల్లోనే ఎరువులను వాడండి. చౌడు భూముల్లో "జిప్సమ్" వాడి అధిక దిగుబడి పొందండి.

**5** సాగు నీటిని సక్రమంగా వాడండి. చేలలో నీరు నిలిచి వున్నప్పుడు ఎరువులు వేయకండి.

**6** పప్పు దినుసుల పైర్లు భూమిలోని నత్రజనిని ఎక్కువ చేస్తాయి. మధ్య మధ్య ఈ పైర్లను పండిస్తే, ముందు పంటలకు నత్రజని మోతాదు తగ్గించవచ్చు.

**7** వేసిన ఎరువులకు పైరుతో పోటీకి వచ్చే కలుపు మొక్కలను నిర్మూలించండి

**8** రసాయన ఎరువులతో మంచి ఫలితాన్ని యివ్వగల అధిక దిగుబడి రకాలను మాత్రమే ఎన్నుకోండి. ఈ రకాలు దేశవాళీ రకాలకన్నా వున్నంత ఎరువుతోనే ఎక్కువ దిగుబడిని యివ్వగలవు.

> మన రాష్ట్రంలో సాగుబడి అయ్యే పంటలలో వరి ముఖ్యమైనది. వేసిన ఎరువులను వృధాకాకుండా సమర్థవంతంగా వినియోగించుకోగల అధిక దిగుబడి వరి రకాలను మాత్రమే సాగుచేయండి.
>
> ఉన్న ఎరువును ఒకేమారు వాడకుండా దఫాలవారీగా వాడి మంచి ఫలితాన్ని పొందండి.
>
> భాస్వరపు ఎరువును కూడా దమ్ములో ఒకమారు, మూడు నాలుగు వారములలోపున మరొకమారు వాడడం మంచిది. దమ్ములో వాడలేని పరిస్థితుల్లో పైరు పూడ్చిన మూడు నాలుగువారములలో వేయండి.
>
> నత్రజని ఎరువును తక్కువ మోతాదుల్లో ఎక్కువ దఫాలలో చిరుపొట్ట దశ వరకు అవసరాన్నిబట్టి వాడండి.
>
> ప్రతిసారి ఎరువు వేసేముందు నీళ్లు తీసి, ఎరువు వేసి, 24–36 గంటల తర్వాత నీళ్లు పెట్టడంవల్ల ఎరువు వృథాకాదు.

పూర్తి వివరాలకు మీ దగ్గరలోనున్న వ్యవసాయ విస్తరణాధికారిని కలుసుకోండి.

కోరమాండల్ వారి వ్యవసాయ నిపుణులు మీకు తగిన సలహాయిచ్చి తోడ్పడేటందుకు సిద్ధంగా వుంటారు.

ఉచిత సలహాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి.




**కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్**

126 సరోజినీదేవి రోడ్, సికింద్రాబాద్









# హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

## సాహిత్యోత్సవాలు

రాజధాని సాహిత్య రసికులు అక్టోబర్ మొదటి వారం సాహిత్యంలోని వివిధ ప్రక్రియలను వినడం, మననం చేసుకొనడంలో మగ్నులై ఆనందంతో ఓలలాడిపోయారు. అక్టోబర్ 2 వ తేదీన డాక్టర్ బిరుదురాజు రామరాజు జాతీయ సాహిత్య పరిషత్ నగర శాఖను ప్రారంభించారు. సాహిత్యం వివిధ సిద్ధాంతాలకు లోనయి పోవడాన్ని అరికట్టి ప్రజలలో జాతీయ చైతన్యాన్ని పెంపొందించడం ఈ శాఖ లక్ష్యమని డాక్టర్ రామరాజు, డాక్టర్ ముదిగొండ శివప్రసాద్, శ్రీ రవ్వ శ్రీహరి, ప్రసాదరాయ కులపతి భండారు సదాశివరావు ప్రసంగించారు. ముఖ్యాతిథి దేవాదాయ ధర్మాదాయ మాత్యుడు శ్రీ రాజాసాగిసూర్యనారాయణరాజు జాతీయ భావాల అవసరాన్ని తెలిపారు. 3, 4 తేదీలలో పద్మశ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు పెద్దన పెద్దరికం విజయనగర సామ్రాజ్యంలోని సంస్కృత కవులు గురించి ప్రసంగించి అపూర్వ విషయాలు అసంఖ్యాకంగా తెలిపారు. కవిత్రయం తర్వాత పెద్దనకు సాటి అయిన కవి మరొకరు లేరని, ఆయన శ్రీ విద్యను ఉపాసించి తదనుగుణంగా కవితలో కమనీయత ఎలా తెచ్చిందీ చెబుతూ, ఆశూత్పల మాలికను ఉదాహరించారు. విజయనగర సామ్రాజ్యం దాదాపు 350 ఏళ్ళు వర్ధిల్లినదని అది సంస్కృత సాహిత్యానికి చేసిన సేవ అపారమని వేదాంత దేశికులు విద్యారణ్యుడు మొదలు విశ్వగుణాదర్శకారుని వరకు 67 మంది మహా కవులు ఉన్నారని పరిశోధన ఫలితాలైన ఎన్నో నూతనాంశాలు తెలిపారు. 5 వ తేదీన ప్రముఖ న్యాయవాది నటులూ, సంగీతజ్ఞులు, సాహిత్యవేత్త, కవి, శ్రీ కోకా రాఘవరావు రచించిన 'శిల్పి' ఖండకావ్య సంపుటిని న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు ఆవిష్కరించారు. దీనిని శ్రీ రాఘవరావు శశాంకకు అంకితమివ్వడం, దీని 200 ప్రతుల అమ్మకం డబ్బు శశాంక కుటుంబానికి సహాయంగా ఇవ్వడానికి నిశ్చయించినట్లు ప్రకటించడం చాల బాగున్నాయి. 6 వ తేదీన యువభారతి పదకొండవ వార్షికోత్సవం సందర్భంగా శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు శ్రీనాథుని కవితను గూర్చి ప్రసంగించారు. శ్రీనాథుని కవితలో గ్రంథ కవుకలమేగాని రసపదార్థం తక్కువ. కాని మాయ అని తెలిసి కూడా మనం సంసారం చేస్తున్నట్లు ఏమీ రసం లేదని తెలిసి కూడా మనం అతని పద్యాలు చదువుతాము. 'శ్రీనాథుడు దేశం తిరిగినవాడు గనుక ఆయన కవితలో ఆ నాటి సమాజంలోని మంచి చెడ్డా మనకు తెలుస్తాయి' అన్నారు శ్రీ పుట్టపర్తి. ఈ ప్రసంగం యువభారతి ప్రారంభించిన 'ప్రతిభా లహరి' ఉపన్యాస మంజరిలో మొదటి పూవు. ప్రారంభోపన్యాసకులు శ్రీ దేవులపల్లి వారన్నట్లు యువభారతి లహరులు రసికులను ముంచెత్తుతాయి. జనం తండోప తండాలుగా ఈ లహరులను వినడానికి వస్తున్నారంటే, యువభారతి కార్యకర్తలు శ్రీయుతులు ఇరివెంటి కృష్ణమూర్తి, వంగపల్లి విశ్వనాథం వంటి వారి అచంచల దీక్ష ఫలితం.

## ప్రపంచ హిందీ మహాసభ

నాగపూర్ టైమ్స్ మేనేజింగ్ ఎడిటర్, ప్రపంచ హిందీ మహాసభ ప్రధాన కార్యదర్శి శ్రీ అనంతగోపాలషోరీ అక్టోబర్ 6 వ తేదీన పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, ప్రపంచ హిందీ మహాసభ వచ్చే జనవరిలో నాగపూర్‌లో జరుగుతుందని ఇది జాతీయ సమైక్యానికే కాక అంతర్జాతీయ సమైక్యానికి తోడ్పడుతుందని అన్నారు. దీనికి దేశంలోని వివిధ ప్రాంతాలనుంచి 2000 మంది విదేశాల నుంచి 200 మంది ప్రతినిధులు పాల్గొంటారని తెలిపారు. హిందీ పీఠాలున్న 21 దేశాల 99 విశ్వవిద్యాలయాల నుంచి ప్రతినిధులు వస్తారన్నారు. వివిధ దేశ భాషల విద్వాంసులను రచయితలను సన్మానిస్తుందని అన్నారు. శ్రీ షోరీ ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావును విద్యామంత్రి శ్రీ కృష్ణారావును కలుసుకుని వివిధ విషయాలు వివరించారు. ప్రపంచ హిందీ మహాసభలో విద్యామంత్రి శ్రీ కృష్ణారావు నాయకత్వాన ప్రపంచ తెలుగుమహాసభ ప్రతినిధివర్గం పాల్గొంటుందని తెలుస్తున్నది. ప్రపంచ తెలుగు మహాసభ ప్రధాన కార్యదర్శి శ్రీ పి. ఎస్. ఆర్. అప్పారావు, కార్యదర్శులు శ్రీయుతులు బాపురెడ్డి, ప్రసాదరావు మహాసభ ఆశయాలు శ్రీ షోరీకు తెలియజేశారు.

## కీర్తికాయుడు తురగా కృష్ణమోహన్

అక్టోబర్ 2 వ తేదీ నగర పత్రికా రచయితలకు మహా దుఃఖ దినమయింది ఆ నాటి ఉదయం ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రారంభించిన కృష్ణా ఎక్స్‌ప్రెస్‌ను మధ్యన అందుకోడానికి దక్షిణమధ్య

### దేశీయాంగ శాఖ మంత్రి



శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి కేంద్ర హోం మంత్రి అయ్యారు. ఈ పదవి నలంకరించిన దక్షిణాత్యులలో వీరే మొదటి వారు.



ఇటీవల మద్రాసులో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు మద్రాసు ఆంధ్ర వాణిజ్యమండలి ఏర్పాటుచేసిన సత్కారసభలో ప్రసంగించిన దృశ్యం. వారికి కుడివైపున కూర్చున్నవారు మండలి అధ్యక్షుడు శ్రీ టి. ఎస్. కృష్ణమూర్తి.

రైల్వే మినీబస్సులో ఒయలుదేరిన పత్రికా రచయిత లలో నలుగురు నకరేకల్లు వద్ద జరిగిన ప్రమాదం కారణంగా మరణించారు. మరణించిన వారిలో ప్రముఖుడు తురగా కృష్ణమోహనరావు ఒకరు. కృష్ణమోహన్ ను తలుచుకున్నప్పుడల్లా అతని సంభాషణ



పార్లమెంటరి వ్యవహారాల మంత్రి శ్రీ కొత్త రఘురామయ్యగారికి కొత్తగా వర్క్స్, హౌసింగ్ నిర్మాణ శాఖలు కూడా అప్పగించటం జరిగింది

చాతుర్యం, వ్యంగ్య వైభవం, ఆంధ్రాభ్యుదయోత్సవాలలో అతని అపూర్వోత్సాహం కళ్ళకు కడుతాయి. కృష్ణమోహన్ ఎం. ఎ. ఎల్. ఎల్. బి. చేసి అక్కౌంటెంట్ జనరల్ ఆఫీసులో కొంతకాలం పని చేసినా మరే పని చేసినా అంతట రచయిత కనుక ఆంధ్ర జనతలో కొంతకాలం, ఆంధ్రపత్రికలో కొంత కాలం పని చేశారు. ఆంధ్రసచిత్ర వారపత్రికలో ఆయన రాజధాని కబుర్లు, పరితలను విశేషంగా ఆకర్షించింది. 12 సంవత్సరాలుగా ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో పని చేస్తూ, కర్తవ్య నిర్వహణకు బయలుదేరి అసువులు కోల్పోయాడు. ఆయన సతీమణి శ్రీమతి జానకిరాణి ప్రముఖ కథా రచయిత్రి. కృష్ణమోహన్‌కు 44వ ఏట నూరేళ్ళు నిండక పోతె తుమ్మెద' వంటి శ్లేష రచనలు, గొప్ప కథలు ఎన్నో వచ్చేవి. వచనసాహిత్యం నిండలేదు. హతవిధి కృష్ణమోహన్‌ను లాక్కు పోయింది

## ఉపశ్రుతి

"ఏమోయ్ నీళ్ళు కాగాయా? త్వరగా నీళ్ళు పోసుకోవాలి?" అన్నాడు భర్త

"బాయిలర్‌లో బొగ్గులు వేయాలి మళ్ళామళ్ళా, లేకుంటే నీళ్ళు కాగడం కల్లా కల్లా" అన్నది భార్య.

"నీళ్ళు కాగాయా అంటే కవిత్వం చెబుతావేమోయ్?" అని గద్దించాడు భర్త

"ఇలాటిదే కదండీ రేడియో కవితాగోష్ఠి! దాని మీద కోపం రాలేదేందుకు?" అని ఎదురు చెప్పింది భార్య

# మహారాష్ట్రంలో వెలసిన మహాలక్ష్మి

వేదం రామశాస్త్రి

'హిరణ్యవర్ణాంహరిణీం సువర్ణరజతస్రజాం
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం —
జాతవేదో మమావహం' —

అని 'శ్రీమహాలక్ష్మి'ని గూర్చిన స్తవం వేదాలలో 'శ్రీసూక్తము' అను పేరులో ఖ్యాతి వహించింది. 'శ్రీ' అనగా రూఢ్యర్థము 'లక్ష్మి' అనియే సంస్కృతమునందేకాదు— తెలుగునను పలికియే 'శ్రీ' వాణీ గిరిజాశ్చిరాయదధతో—అని ప్రథమాంధ్ర కవియైన నన్నయ భట్టారకుడు 'శ్రీ' కారంతోనే ప్రారంభించినాడు.

తిక్కన సోమయాజియూ 'శ్రీ' యనగౌరినా బరగు—అనికదా ప్రారంభించినాడు భారత రచనను.

వేదకాలం నుండీ 'శ్రీ మహాలక్ష్మీస్తవం' నేటి వరకూ భారతదేశమున అవిచ్ఛిన్నముగా సాగుతూంది! అందు మహారాష్ట్రంలో ప్రతి యింటా విశేషంగా కానవస్తూంది 'మహాలక్ష్మీపూజ'. అందుకు కారణం—కొల్హాపురిలో వెలసిన మహాలక్ష్మియే!

స్కాందపురాణాంతర్గతమైయున్న కరవీరమాహాత్మ్యంలో—

"యోజనందశహే పృథు కారాష్ట్రే దేశదుర్వరి,
తన్మధ్యేపంచకోశంచ కాశ్యాద్యాదధికంభువి
క్షేత్రంవై కరవీరాఖ్యం క్షేత్రంలక్ష్మీవినిర్మితం,
తత్క్షేత్రం హిమహత్పుణ్యందర్శనాత్పాపనాశనం
తత్క్షేత్రే ఋషయ సర్వేబ్రాహ్మణా వేదపారగాః
తెషాందర్శన మాత్రేణ సర్వపాపక్షయోభవేత్"

(పురాణకాలమున) మహారాష్ట్ర దేశం దశయోజన విస్తీర్ణము కలది. దుర్గమమైనదీ దేశం. ఆదేశ మధ్యభాగం 'కాశీ' కంటే పవిత్రమైనదీ మహాలక్ష్మిచే నిర్మింపబడిన 'కరవీరక్షేత్రం' [కొల్హాపూర్(రి)]

## కొల్హాపూర్ మహిమ

ఈ క్షేత్రం గొప్ప పుణ్యక్షేత్రం. ఇచట వెలసియున్న 'శ్రీ మహాలక్ష్మి'ని దర్శించినంత మాత్రమునసే సమస్త పాపములూ నాశమగునని ప్రథ. ఈ చోట వేదపారంగతులైన బ్రాహ్మణులు, ఋషిగణములు నివసిస్తున్నారని, వారిని దర్శించుటచే సమస్త పాపాలూ నశిస్తాయని పై శ్లోకముల భావం.

నేటి కొల్హాపూరు పూర్వమున 'కరవీర' క్షేత్రముగా భాసించింది. ఈ చోటనె 'శ్రీ మహాలక్ష్మి' నిత్య నివాస మేర్పరుచుకొన్నది.

శ్రీ మహాలక్ష్మి వైకుంఠమున శ్రీ మహావిష్ణువు సన్నిధానమున ఉండుటకు ఇష్టములేనిదై విష్ణువును వదలి—ఎక్కడంతమునకు రాలై —ప్రపంచ మంతయు తాను తపస్సు చేసుకొనుటకు ప్రశాంత

(42 వ పేజీ చూడండి)



ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావును మద్రాసులోని ఆంధ్ర సాంస్కృతిక సంస్థ కళాసాగర్ బ్రహ్మాండమైన రోజాపూలమాల, పట్టు ఉత్తరీయంతో యిటీవల సత్కరించిన దృశ్యం.

—— సీరియల్ ——

# లాలస

కాకాని కమల

*[గతసంచిక తరువాయి]*

**శాం**త పెళ్ళి వారం రోజులుందనగా తండ్రి వచ్చాడు.

అనూరాధ పుట్టింటికి వెళ్లటానికే నిశ్చయించుకుంది. శ్రీనివాస్ పాతపాటే పాడాడు... "అమ్మా నాన్నా వస్తారుకదా! ఇటువంటివి పెట్టుకుంటే నాకు కుదర్దు. లక్ష్మి పెళ్ళికి తప్పకుండా వస్తాను" అన్నాడు.

"రమణని అడిగానని చెప్పండి. ఇవాళ రేపు బ్యాంకు జాబ్సే బాగున్నాయి. ఎప్పుడయినా వీలయితే రమ్మనండి రమణని" అన్నాడు. అల్లుడు ఆమాత్రం మాట్లాడినందుకే పొంగిపొయ్యారు రామనాధంగారు. ఆయన అక్కడ వున్నదే ఒక్క పూట. సాయంత్రం తిరుగు ప్రయాణం అవనే అయ్యారు.

ఇంకో గంటకి కోడలు వెళ్లిపోతుందనగా అత్తగారు చాటుగ పిలిచి "అమ్మాయి అనూరాధా! నువ్వు మరోలా అనుకోకు తల్లీ. మిమ్మల్ని గదిలోకి పంపించటం కుదర్లేదు. వాడు చదువు పూర్తి అయితే గాని వద్దని పట్టుబట్టాడు. ఎక్కడ చదువు సాగదోనని వాడిభయం. అంతకంటే ఏంలేదు. చూస్తున్నావుగా వాడి శ్రద్ధ! నీకు మేం ఎప్పుడూ అన్యాయం చెయ్యం. నా మొఖం చూసి ఇక్కడ సంగతులు అక్కడేం చెప్పకు తల్లీ! నీ తల్లితండ్రుల దగ్గర కష్టం సుఖం చెప్పకోవద్దనే హక్కు నాకు లేదనుకో! కాని వాళ్ళు తప్పుగా అర్థం చేసుకుంటారని నా బాధ. నువ్వు ఈసారి తిరిగి రాగానే మిమ్మల్ని ఇద్దర్నీ ఒకటి చేస్తాం. మీ ఆయనకి చదువంటే ప్రాణం. అంతేగాని వేరే ఏంలేదు. మా పరువు కాపాడే భారం నీదే!" అంది వేడికోలుగ.

అనూరాధ చాలా ఖంగారు పడింది. అత్తగారు ఇల్లా మాట్లాడుతుందని ఆ అమ్మాయి కల్లోకూడా అనుకోలేదు. నిజానికి అత్తగారు చాలా మంచిది. చాలా మంది కొడుకూ కోడలూ సన్నిహితంగా వుంటే మొఖం మాడ్చుకుంటారు. కొడుకు ఎక్కడ కోడలి పరమై పోతాడోనని ఈర్ష్య పడతారు. కాని శ్రీనివాస్ తల్లి చాలా వుత్తమురాలు. ఆవిడకి కూతురు కోడలు ఒకటే! అందుకే నా విధి వక్రించిందేమో! అనుకుంటుంది అనూరాధ.

"అబ్బే! అటువంటిదేం లేదండి. ఇవన్నీ నేను వాళ్లకెందుకు చెపుతాను" అంది. అలా అంటుంటే ఆమెకి తెలియకుండానే దుఃఖం పొర్లుకొచ్చింది. నా బ్రతుకు ఇలా అయిందన్నదే ఆమె బాధ. ఆమె తపించేది పురుష స్పర్శ కోసం కానే కాదు తనతో భర్త ప్రేమగ వుండి ఆప్యాయతగా మాట్లాడితే రెండేళ్లేం ఖర్మ ... ఎన్ని సంవత్సరాలయిన ఆమె ఎదురు చూడగలదు. ఆ పాటి ఆత్మస్థైర్యం మనోనిబ్బరం అనూరాధకి పుష్కలంగా వుండబట్టే ఇన్నాళ్లు అంత ఓర్పుగ మెసులుకుంది. భర్త అభివృద్ధికి ఏ భార్యా నిరోధి కాదు. అందులో భారత దేశంలో పుట్టి సత్ సంప్రదాయంలో పుట్టిన — అనూరాధ—వంటి అమ్మాయి అసలే కాదు. అయినా పుట్టింటిలో ఏ ముఖం పెట్టుకుని చెప్తుంది. "నా భర్త నన్ను సరిగా చూట్టం లేదని" భర్త బాగా చూసుకుంటే ఆడపిల్లలు గర్వంగా చాటుకుంటారు. లేక బాధలు పెడితే కప్పెట్టుకుంటారు. అంతేగాని అంత తేలిగ్గా బయట పడరు. అనూరాధ ఆ కోవకి చెందిందే!

*జరిగినకథ 6:* రామనాధంగారి భార్య సుభద్రమ్మ. వారికి అనూరాధ, లక్ష్మి, సుందరి, శోభ అనే నల్గురమ్మాయిలు, రమణ అనే అబ్బాయి ఉన్నారు. అనూరాధకు పెళ్లి సంబంధాలు చూస్తూంటారు రామనాధంగారు. అనూరాధని చూసుకుని వెళతారు పెళ్ళివారు. ఎమ్. బి. బి. ఎస్. చదువుతున్న శ్రీనివాస్‌తో అనూరాధ వివాహం జరుగుతుంది. యౌవ్వనోద్రేకంలో తప్పటడుగు వేస్తారు సుందరి కృష్ణలు. భర్త శ్రీనివాస్‌కు తనంటే ఇష్టంలేదని ఎవరినన్నా ప్రేమించి ఉంటాడని అనుకుంటుంది అనూరాధ. పండక్కి రానందువల్ల కూతురు, అల్లుడికిగాను వియ్యంకుడి పేరున డబ్బు పంపిస్తారు రామనాధంగారు. అనూరాధపట్ల తన ప్రవర్తనకు పశ్చాత్తాప పడతాడు శ్రీనివాస్.

"నాకు తెలుసు తల్లీ! నువ్వు గుణవంతురాలివి. మాలో చక్కగ కలిసిపోయావ్. వాడే మూర్ఖపు పట్టుదలతో వున్నాడు" అంది కళ్ళు వత్తుకుంటూ రాజ్యలక్ష్మమ్మ.

అనూరాధ వచ్చేస్తుంటే ఆడపడచు కాళ్లకి పసుపు రాసి కుంకం ఇచ్చింది. "చెల్లెలు పెళ్లి కుదిరితే నెల్లాళ్ళు వుంచుకుందురు లెండి. ఇప్పుడు మాత్రం తొందరగ పంపించెయ్యండి" అంది అత్తగారు.

"అలాగేనమ్మా!" అన్నారు రామనాధంగారు. అనూరాధ వూరికి వెళ్లే సమయానికి శ్రీనివాస్ కాలేజీకి వెళ్లిపోయాడు. సాయంత్రం ఆరున్నరకి ఇంటికి వచ్చాడు. ఇంటికి రాగానే కల కల్లాడుతూ కనుపించే భార్య ఆ రోజు లేకపోయేసరికి అతనికి ఏదో వెలితిగా అనిపించింది. ఇంట్లో నిండుగా అనూరాధ తిరగటం ఆ ఇంట రెండేళ్ళుగ అలవాటయిపోయింది

* * *

'అనూరాధ' గుమ్మంలో అడుగు పెట్టగానే చెల్లెళ్లు తమ్ముళ్లు సంతోషంతో ఎదురు వచ్చి స్వాగతం పలికారు

"హాయ్...అక్కాయ్! మళ్లీ ఎన్నాళ్లకే" అంటూ కౌగలించుకుంది సుందరి. వాళ్ళందరి ఆప్యాయత చూస్తుంటే అనూరాధకి కళ్ళు చెమ్మగిల్లాయి.

"అక్కా! బావగారు పెళ్లికొస్తారా" అన్నాడు రమణ ఆత్రుతగా.

"అక్క కొంచెం ఒళ్లు చేసింది. ఇంకా తెల్లబడింది. హైద్రాబాద్ నీళ్లు పడ్డాయి" అంది లక్ష్మి.

"ఏమైనా విశేషమేమో! కనుక్కోండి" అంది తల్లి నవ్వుతూ. అనూరాధ క్షణం సేపు తెల్లబోయి తేరుకుంది. "అటువంటిదేంలేదు" అంది ఇబ్బందిగా.

ఆ రోజంతా చాలా సరదాగా గడిచిపోయింది. మళ్లీ ఇన్నాళ్లకి చెల్లెళ్ల తోటి, తమ్ముళ్లతోటి పుట్టింట గడిపింది...

"మీ అత్తగారు సరిగా చూస్తుందిటే! మర్యాద లేమయినా తక్కువయ్యాయని నిన్ను సాధించటం లేదు కదా" అంది సుభద్రమ్మ.

"లేదమ్మా ! ఆవిడ అటువంటిది కాదు" అంది అనూరాధ.

"పోన్లే తల్లి ! కావలిసిందే అది. అయినా వున్నంతలో అన్నిబాగానేజరిపాం" అని "అతను పెళ్లికి రానన్నాడటగా !" అంది.

"ఏమ్మా! అనూ... మీ ఆయనేమన్నా మనసులో కోపం పెట్టుకున్నాడా. మళ్లీ మన గుమ్మంలోకి రాలేదు" అన్నాడు అప్పుడే వచ్చిన తండ్రి.

"అబ్బే... అదేంలేదు నాన్నా ! ఆఖరి సంవత్సరంకదూ ! ఎక్కడికి వెళ్లటంలేదు." అంది ఇబ్బందిగా.

"అతనిష్టం. పోనీ వస్తాడేమో ఓ వంద రూపాయలు ఇద్దామనుకున్నారు మీ నాన్న. పెళ్లి అయ్యాక అతను మళ్లీ గుమ్మంలోకి రాలేదు" అంది సుభద్రమ్మ.

అంతా కలిసి నవ్వుకుంటూ సరదాగా భోంచేశారు కూతురు వచ్చిందని 'నిమ్మ వుప్పు' వేసి పులిహోర చేసింది తల్లి. మొన్ననే మా అత్తగారుకూడా చేసింది. దాన్ని అక్కడంతా 'చిత్రాన్నం' అంటారు" అంది అనూరాధ. "ఆయనకి ఇదంటె చాలా ఇష్టం" అనికూడా అంది.

"అయితే బావ వచ్చినప్పుడల్లా అమ్మ పులిహోర చేసితీరాలి" అంది లక్ష్మి.

'అతను రావాలేగాని అదెంత భాగ్యం' అంది సంబరంగా సుభద్రమ్మ. అంతా కలిసి నవ్వుకుంటూ సరదాగా భోంచేశారు.

ఆ మర్నాడు సుందరి రమణ కలిసి సరదాగా సినిమా ప్రోగ్రాం వేశారు.

"అక్కా నువ్వేం సినిమాలు చూశావే" అంది లక్ష్మి.

ఏవో రెండు మూడు పేర్లు చెప్పింది అనూరాధ.

"బావగారు కూడా వచ్చారా" అన్నాడు రమణ.

"ఆ... అంతా కలిసే వెళ్లాం" అంది అనూరాధ. నిజానికి శ్రీనివాస్ రానేలేదు. తోడికోడలు, అనూరాధ, ఆడపడుచు వెళ్లారు.

"హైద్రాబాదులో ఏవేం చూశావే అక్కా" అంటూ శోభ ప్రశ్న !

"బావ ఎన్టీఆర్ ఎస్టేటు చూపించాడా? చార్‌మినారు లైట్లతో అలంకారం చేసినప్పుడు చాలా బావుంటుందిటగా ! నౌబత్ పహాడ్ అంటే ఏవుంటుందే ! టాంకుబండ్ అంటే అంతా రోడ్డేటగా" అంటూ అక్కగార్ని వుాదరగొట్టేశాడు రమణ.

"ఒరేయ్ ! నీకంత యావగా వుంటే ఒకసారి రా! అన్ని చూడు. అంతేగాని నన్ను చంపకు" అంది అనూరాధ.

"బావగారి చదువయి పోనీ! ఓ నెల్లాళ్లు అక్కడే మకాం. ఇప్పుడొస్తే చూపించే వాళ్లుండరు. ఇప్పుడు వచ్చి ఆయన్ని డిస్టర్బు చెయ్యటం బాగోదు" అన్నాడు.

"బతికించావు" అనుకుంది అనూరాధ.

"అక్కయ్యా మొన్నీ మధ్య హైద్రాబాదులో రచయిత్రుల మహాసభలు అయ్యాయి వెళ్లక పోయావ్ ! భానుమతి ముఖ్య అతిదిట !" అంది సుందరి.

మొత్తానికి చాలా సరదాగా హాయిగ గడిచి పోయాయి రోజులు. శాంత పెళ్లి ఇంటిల్లిపాది వెళ్లారు. పెళ్లి కాగానే రమణ సుందరి వచ్చేశారు. లక్ష్మి కాబోయే కోడల వుండాల్సిందే! అన్నారంతా. అనూరాధ మళ్లీ మళ్లీ వస్తుందా పెడుతుందా అంటూ ఆమెనీ ఆపుచేశారు. వాళ్లంతా కలిసి వార రోజులాగి వచ్చారు. రమణకి బ్యాంకు జా వచ్చి నాలుగు నెల్లే అయ్యింది. ఇంకా క ఫరమ్ కాలేదు. సుందరి బి. యస్‌సి మొదటి సంవత్సరం చదువుతోంది. కాలే పోతుందని వచ్చేసింది. ఈ పది రోజు ఇంట్లో ఎవరూ లేక పోవటంతో సుందరి స్వేచ్ఛ ఎక్కువయింది. కృష్ణని "కలుసు



కోవటం'' దినచర్య అయిపోయింది. కాని ఆమెకి అనుకోకుండా ఇంకో విషమ సమస్య ఎదురయింది. కృష్ణతో శృంగారానికి ఫలితంగా నెల తప్పింది. తిన్నది వంట పట్టకుండా వాంతులు నీరసం పట్టుకున్నాయి. వాంతులు ఎక్కువగ లేవుగాని. కడుపులో త్రిప్పట, నీరసం ఆమెని చంపేస్తున్నది. సుందరికి పరిస్థితి తల్చుకుంటే కంపించి పోతున్నది. తల్లికి తండ్రికి తెలిస్తే ఇంకేమయినా వుందా ? ఈ విషయం కృష్ణకి తెలిస్తే ఏమంటాడు ? తన్ని స్వీకరిస్తే ఫరవాలేదు. లేకపోతే ప్రాణత్యాగం తప్ప గత్యంతరం లేదు. ఎలాగైనా గొడవ తప్పదు—అని భయపడింది. ఇప్పుడంటే ఇంట్లో ఎవరూ లేరు గనుక సరవాలేదు. కాని రేపు వాళ్లు వచ్చాక కూడా ఇట్లా వుంటే పసికట్టరూ ! డాక్టరు దగ్గరికి తీసుకెడితే గుట్టు బయట పడుతుంది అని కంపించి పోయింది. ఎల్లవేళలా 'పూసిన తంగేడు' లా వుండే సుందరి ఇప్పుడు ఏ వేళా 'వాడిన పువ్వు' లా వుంటున్నది. ఆలోచిస్తే చివరికి ఆమెకి ఒక్కటే మార్గాంతరం కనుపించింది. అది కృష్ణకి చెప్పటం. ఒకవేళ అతను తన్ని తృణీకరిస్తే అప్పుడే తరువాత విషయం ఆలోచించ వచ్చు అనుకుంది.

చల్లగా చావు కబురు చెప్పినట్లు ఒకరోజు కృష్ణకి అసలు విషయం చెప్పింది. ఆ క్షణం రాడికిఏటూ తోచలేదు. తన చదువు పూర్తయి ఇంకా ఆర్జన పరుడు కాకుండానే ఒక బిడ్డకి తండ్రి కాబోతున్నాడు. సుందరికి అన్యాయం చేసేవుద్దేశం లేదు. ఈ సంగతి ఇంట్లో తండ్రికి గాని తల్లికిగాని అసలు ఎలా చెప్పాలి? అన్న మీమాంసలో పడ్డాడు.

''మంచో చెడో! నేను నిన్నే నమ్ముకున్నా కృష్ణా. ఇప్పుడు నా జీవితం నీచేతుల్లోవుంది. నీకు మనస్ఫూర్తిగా ఇష్టమయితే పెద్ద వాళ్లకిచెప్పి మ్యారేజి చేసుకోవటం వుత్తమం. లేకపోతే బలవంతంగా మాత్రం నేను నీ దారికి అడ్డురాను. నా సమస్యకి నేనే పరిష్కారం చూసుకుంటాను'' అంది బేలగా కన్నీళ్లమధ్య సుందరి.

''ఛ...ఛ... అలా అధైర్యపడకు. నీకు నేను అన్యాయం చేస్తానని ఎలా అనుకున్నావ్! మనిద్దర్ని ఎవరూ విడదియ్యలేరు. లోకం అంతా నిన్ను వెలి వేసినా నీకు నేనున్నాను. ఏదో ఒకటి ఆలోచిద్దాం'' అన్నాడు.

సుందరి కళ్లల్లో కోటి మెరుపులు మెరిశాయి. ''థాంక్యూ కృష్ణా. ఆ మాటఅన్నావ్! చాలు''అంది కృతజ్ఞతగ.

*　　*　　*

అనూరాధని మళ్లీ తండ్రి వెళ్లి అత్తగారింట్లో దించి వచ్చాడు. పెళ్లికి ఆమె మామగారు వచ్చారు అంతే! అనూరాధ ఆటో దిగి లోపలికి వస్తుంటే హాల్లోనే కూర్చుని వున్న శ్రీనివాస్ నవ్వుతూ చూశాడు. అతని నవ్వు ఆమెకి పన్నీటి జల్లుతో స్వాగతం చెప్పినట్లనిపించింది. మామ గార్నికూడా బాగానే పలకరించాడు

మళ్లీ మామ్మూలు కార్యక్రమం ప్రారంభమయింది అనూరాధకి. ఈ మధ్య భర్త ప్రసన్నంగా కనుపిస్తున్నా చొరవ తీసుకోలేక పోతున్నది. అతను ఎదుటపడితే కాఫీ అందించే సాహసం కూడా లేదు. అసలతను ఎప్పుడూ బిజిగానే వుంటాడు. అసలు ఇంట్లో వుండేదే తక్కువ. ఏడు ఎనిమిది గంటలకల్లా కాలేజీకి వెళ్లిపోతాడు. భోజనానికి వస్తే వస్తాడు లేక పోతే బయట తింటాడు. రాత్రి వచ్చేసరికి పొద్దు పోతుంది. కాబట్టి అసలు ఇద్దరూ ఎదురుపడే సందర్భాలే తక్కువ. జన్మకో శివ రాత్రి అన్నట్లు ఎప్పుడైనా అతను మంచిగా వున్నా పలకరించే ధైర్యం లేదు అనూరాధకి. పోనీ అతనైనా చిన్న చిన్న మాటలైనా మాట్లాడడు. మొదట్నుంచి అలాముభావంగా వుండి ఒక్కసారి పలకరించాలంటే ఇద్దరికి బిడియం. నన్నటి చిరునవ్వు పలకరింపులు మొదలైన మార్పులు భర్తలో క్రమేపి రావటం అనూరాధ గమనించక పోలేదు. కాని మునుపటి బర్త ప్రవర్తన తల్చుకుంటే అనూరాధ లోని వుత్సాహం చచ్చిపోతోంది.

శాంత పెళ్లి అయిన వెంటనే కాపురానికి వచ్చేసింది. ''శాంత చిన్న పిల్ల. మొన్ననే పదహారు నిండాయి. హైద్రాబాదులో వంటరి కాపురం సమర్థించగలదో లేదోనని సందేహించింది సీతమ్మ. ''హోటల్ భోజనం ఇంకా ఎన్నాళ్లు తినమంటారు చెప్పండి వాడ్ని! ముందు కొంచెం ఇబ్బంది పడినా నెమ్మది మీద అదే అలవాటయి పోతుంది. మా అబ్బాయి కూడా సర్దుకుపోయే రకమే! అయినా ఇవాళ రేపు ఆడపిల్లలు అన్ని సమర్థించుకు రాగలు'' అంది వియ్యపురాలు. నిజమే! పెళ్లి అయ్యాక కూడా అల్లుడ్ని హోటల్ మెతుకులు తినమనటం ఏం బాగుంటుంది. రెండు రోజులాగి పంపించినా శాంతకి సంసార బాధ్యత కొత్తదేకదా! అనుకుని సీతమ్మ కూతుర్ని కాపురానికి పంపించింది. శాంత అత్తగారు కూడా వచ్చి కాపురం పెట్టించి నాలుగు రోజులుండి వెళ్లి పోయింది. ఆవిడఒక్కరోజు లేకపోయినా ఇల్లు గడవని పరిస్థితి. శాంత భర్త మోహన్‌రావు కిరాయికి తీసుకున్న ఇల్లు హిమాయత్ నగర్‌లో వుంది. వారి అడ్రసు రాస్తూ మేనత్త అనూరాధకి వుత్తరం వ్రాసింది. చివర్లో ''మీ అత్తగారు ఒప్పుకుంటే ఒక్క సారి వెళ్లి చూసిరండి. శాంత చిన్న పిల్ల.

(40 వ పేజీ చూడండి)



# పుత్తడి బొమ్మ

సీరియల్

రామవరపు వేణుగోపాలరావు

*(గత సంచిక తరువాయి)*

"మూఢా" అంతస్తుకి చేర్చేవు. సరే, బాగానే వుంది. ఇంటికి తీసుకెళ్లక ఇక్కడి కెందుకు తీసుకొచ్చేవు ?''

''మనం ఇక్కడికి సరదాగా రెండు రోజులుందా మని వచ్చాం. ఇంటికి వెళ్తే నీకు వంటా, నాకు స్నేహితుల బోరూ తప్పవు. అదీ కథ !''

''అదా, సంగతీ ? !''

''అవును. మన కార్యక్రమం ఎనౌన్స్ చేస్తున్నా. జాగ్రత్తగా విను. కాసేపట్లో మనం భోజనం చేసి పబ్లిక్ గార్డెన్‌కి వెళ్తాం. ఆ తర్వాత టేంక్ బండ్‌కి... ఆనక ఏదేనా సినిమాకి... వెళ్తున్నాం... తర్వాత పడక... ఓ. కే ! ?''

''ఓ. కే !'' – అని అన్నది గానీ, తనేదైనా తప్పు చేస్తున్నా నన్న భావం రజనికి కలగలేదు...

భోజనం చేసేక అబిడ్స్‌కి వెళ్లేరు రజనికి గులాబీ రంగు నైలెక్స్ చీర కొన్నాడు రవి. తర్వాత బంగారం షాపుకి వెళ్లేరు నీలం పొడి వున్న బంగారపు వుంగరం ఒకటి కొని రజని చేతి వేలుకి తొడిగాడు .. రిక్షాని పిలిచి బేరమాడేడు. రిక్షా ఎక్కబోతూ రజని కెవ్వుమని అరవబోయింది. ''ఇదేమిటీ రిక్షా యిలా వుందీ ?'' అంది ఆశ్చర్యబోతూ. ''ఇక్కడ ఇవి ఇలాగే వుంటాయి'' అన్నాడు రవి నవ్వుకుంటూ.

పబ్లిక్ గార్డెన్ దగ్గర రిక్షా దిగేరు. చుట్టూ సంభ్రమంగా చూసింది రజని. అవీ, ఇవీ చూపిస్తూ వివరంగా చెపుతూ ముందు నడిచేడు రవి... లోపలికి వెళ్లి నిర్జనంగా వున్న చోట, పచ్చికలో కూర్చున్నా రిద్దరూ !

కూర్చున్న పావుగంట వరకూ ఇద్దరూ ఒకరి నొకరు చూస్తూ వుండిపోయారు ఒకరి హృదయా న్నొకరు తెలుసుకోవాలన్న ఆరాటం ఎక్కువ కాసాగింది ..

''ఇదేమిటి. నేను మగవాడిని. ఆమెకన్నా పెద్దవాడిని ఇలా మౌనంగా కూర్చోవడం ఏం బాగుంది !'' అనుకున్నాడు రవి.

''ఏమిటిదీ చదువుకున్నదానిని. తెలివైనదానిని. ఇలా సిగ్గు పడ్తున్నానేమిటీ ? రవి ఏమను కుంటాడూ ?'' అనుకుందామె

చివరికి యిద్దరూ ఒకేసారి మాటాడబోయి నవ్వుకున్నారు పువ్వుల మధ్య ఆహ్లాదకరమైన వాతావరణంలో, సాయంకాలం వరకూ అవీ యివీ మాట్లాడుతూ గడిపారు. మెల్లిగా నడుచుకుంటూ టేంక్‌బండ్ వరకూ వెళ్లేరు నీళ్లలోని దీపాల్ని చూస్తూ, సిమెంటు సోఫాలో కూర్చున్నారు.

''మావయ్యా, అమ్మమ్మ ఏమంది ?''

''ఏమంటుందీ, పాతపాటే !''

''మరెలా ?''

''ఎందుకలా గాభరాపడ్తావు ? నామీద నమ్మకం లేదా ? అమ్మని ఎలాగో ఒకలా ఒప్పించే బాధ్యత నాది !''

''సరేగాని మావయ్యా ! ప్రపంచంలో ఇందరు అమ్మాయిలు వున్నారు ... వాళ్లల్లో నాకన్నా అందమైన వాళ్లుకూడా వుండే వుంటారు ... నేనే నీ జీవితంలోకి రావాలని ఎందుకు కోరుకుంటు న్నావూ ?''

''ప్రేమ...''

''ఎవరంటే ?''

''నువ్వంటే —!''

''ప్రేమంటే ఏమిటి ?''

''స్త్రీ పురుషుల మధ్య వుండే పరస్పరాకర్షణా, దేహాల కలయికలకి మించిన ఒక అపూర్వ శక్తి... ఆదే ప్రేమ !''

''అలాగా – నువ్వు చెప్పేది నాకేం అర్థం కావటం లేదు మావయ్యా !''

''నీమీద నాకు వున్నది ప్రేమ !''

''అంటే — నా కోసం నువ్వేమయినా చేస్తావా ?''

''అవును. అదే ప్రేమ అంటే – నీకోసం నేనేమైనా చెయ్యగలిగే శక్తి ధైర్యం అప్పుడే వస్తాయి... !''

చీకటి పడిన రెండు గంటలకి హోటల్ చేరుకున్నారు. భోజనం చేసేక కుర్చీల్లో కూర్చున్నారు తొమ్మిదిన్నర దాటింది.

''సినిమాకి వెళ్దామా ?''

''ఉఁహూఁ. ఇవాళ వద్దు. రేపు వెళ్దాం !''

''సరే !''

''మీ వూళ్లో ఇంతమంది అందమైన అమ్మాయిలున్నారుకదా, వాళ్లెవరితోనీ నీకు పరిచయం కలగలేదా ? వాళ్లెవరిమీదా నీకు ప్రేమ కలగలేదా ? లేకపోతే నా అంత అందగత్తె లేదం టావా, కొంపతీసి !'' అంది.

'నీ జీవితంలో నేనేనా మొదటి స్త్రీని' అనే ప్రశ్న ఆమె మాటల్లో అంతర్లీనమై వుంది.

అది అర్థంచేసుకున్న రవి నవ్వుతూ ఆమెని చూశాడు.

''రజనీ, నాకు ప్రేమంటే ఇంతవరకూ తెలీదు ! నాతోపాటు చదివే అమ్మాయిల్ని చూస్తూ గుటకలు మింగేవాణ్ని. అంతే. వయసొచ్చిన వాళ్లని కామం అనేది కదిలిస్తుంది. కాని విపరీతమైన ప్రేమ వుంటేనేగాని వాళ్లు హద్దుమీరరు ఆడపిల్లలకి అనుమానాలూ, భయాలూ ఎక్కువ. అంచేతే ఆడపిల్ల ఎంతో అరుదుగా ముందుకి అడుగేస్తుంది. ఎంతో ధైర్యం, కోరికా వుంటేగానీ ఆడది ఆ సరిహద్దు రేఖ దాటదు. మగాడు ఆ హద్దు దాటడానికి ఎప్పుడైనా సిద్ధమే !''

''ఇంతకీ నువ్వెప్పుడైనా హద్దుమీరేవా ? ... అది చెప్పవేం ?'' అంది రజని చిరునవ్వు చిందిస్తూన్న మొహంలో చిన్న విసుగు ప్రదర్శిస్తూ.

''లేదు. ఇంతవరకూ నాకు ప్రేమ అనేదే తెలీదు. నువ్వు నా కళ్లలో పడనంతవరకూ నేనూ జడపదార్థాన్నే నిన్ను చూసేకనే నేను మనిషి నయ్యేను ..''

''హద్దుమీరావా, పోనీ ?''

''లేదుగాని, యిప్పుడు నిన్ను చూస్తూంటే హద్దుమీరాలనే వుంది !'' అన్నాడు రవి కుర్చీలోంచి లేస్తూ.

''ఏయ్ !'' అంది రజని బెదిరిస్తున్నట్టు.

ఆమెకి అభిముఖంగా నడిచి, రజని భుజాల

**జరిగిన కథ 8 :** సరస్వతమ్మ వ్యసన పరుడైన భర్త క్షయవ్యాధితో మరణించటంతో ఒంటరి దవుతుంది. కులం కానివాడిని పెళ్లి చేసుకున్న కూతురు జానకిని వెళ్లగొడుతుంది. 'లా' చదువుతున్న రవి, పెళ్లి చూపులకు పోవ నిరాకరించగా బాధపడ్తుంది. కంబారి పుల్లిగాణ్ని దారుణంగా హింసిస్తున్న గవరయ్య బుగతని ఎదిరించి పుల్లిగాడ్ని విడిపిస్తాడు ధర్మయ్య తల్లి వద్దంటున్నా అక్క జానకిని చూడటానికి వచ్చిన రవి తనకు రజనిని పెళ్లి చేసుకోవటం ఇష్టమేనని తెలియచేస్తాడు. ధర్మయ్యపై పగబడ్తాడు గవరయ్య బుగత. బియ్యం బాగు చేయడానికని ఇంటికి వచ్చిన చుక్కను చెరచ ప్రయత్నించి విఫలుడయిన గవరయ్య బుగత కనకారావుపై తనకున్న రాజకీయ కక్షని తీర్చుకోవడానికి పథకం వేస్తాడు. చుక్కమ్మను చెరచి చంపాడన్న పగతో కనకారావుని హత్య చేసాడని ధర్మయ్యకోసం వెతుకుతుంటారు పోలీసులు. ఓ అర్ధరాత్రి వేళ వచ్చి తాను హంతకుడు కాడని తండ్రికి చెప్పి వెళ్లిపోతాడు ధర్మయ్య. రజనితో తన పెళ్లికి తల్లి నిరాకరించటంతో ఎవరికీ చెప్పకుండా రజనితో హైదరాబాద్ వస్తాడు రవి.

మీద రవి తన చేతులు వేశాడు. ఆ స్పర్శకి రజని శరీరం వినదించే తంత్రిలా కంపించింది. లజ్జతో ఆమె మొహం కందిపోయింది.

తనంత అదృష్టవంతురా లెవరు ?

రజని సంతోషంతో వొణికిపోయింది.

తాను ఎదురు చూసిన పురుషుడు ఏ దివ్య లోకాలనుంచో దిగివచ్చినట్టు ఈనాడు తన ముందు నిలబడి వుండడం అదృష్టం కాక మరేమిటి ? అలా రాకుండా వుండి వున్నట్లయితే తన జీవితం మోడు బారిపోయేది !

తలెత్తి — నిలబడి వున్న రవిని చూసింది రజని. రవి కళ్లలోని వెలుగునీ, కాంక్షనీ చూసింది. ఆ కళ్లలో మండుతోన్న కోరికకి తన సౌందర్యం గాలిలా సాయం చేస్తున్నదని గ్రహించింది.

తను కొన్న గులాబీ రంగు చీరలో — తన జీవన పరమావధిలా వున్న రజనిని లేవనెత్తి తన గుండెలకి అదుముకున్నాడు రవి. రజని గుండె ఒక్కసారి ఝల్లుమంది. జన్మ సహస్రాలు ఇలా కౌగిలిలో పరవశించిపోయి, ఆ తర్వాత ఏమయిపోయినా సరే, అనిపించింది యిద్దరికీ...

''రజనీ — నువ్వు నా దానివి !''

''మావయ్యా, నువ్వు నా వాడివే గదూ ?''

## *11*

పార్వతీపురం చేరుకున్న రాములి చేతిలో పదిహేను రూపాయల చిల్లర మాత్రం మిగిలింది.

టౌన్ స్టేషన్‌కి ఎదురుగా మొండిగోడలు నాలుగుంటే వాటిమీద తాటాకులూ, ఎందుకూ పనికిరాని రేకులూ, చెత్తా చెదారం కప్పి— పై కప్పు అమర్చుకున్నాడు.

గుడిసెలో కూర్చుని ఎదురుగా కనిపించే స్టేషన్‌నీ, వచ్చే పోయే ట్రెయిన్‌లనీ, నడిచే జన సమూహాన్నీ, కదిలే రిక్షాల్నీ చూసేవాడు. చూసి విరక్తిగా నవ్వుకునేవాడు.

కూర్చుని కూర్చుని విసుగనిపిస్తే బజారులోకి వచ్చేవాడు ... దగ్గరున్న సవరగూడల నుంచి అవీ యివీ కావిళ్లతో మోసుకువచ్చే గోచిపాతరాయుళ్లనీ, వాళ్ల ఆడవాళ్లనీ, రొదచేసే బస్సుల్నీ, ధూళి ఎగిరే రోడ్లనీ, ఎడతెరిపి లేకుండా సాగే జన ప్రవాహాన్నీ చూస్తూ నవ్వుకునేవాడు. చెవులు చిల్లులు పడే ధ్వనుల్ని వింటూ నిర్ఘాంతపోయేవాడు.

జనం జీవం తొణికిసలాడ్తోంది ఆ బజార్లో
జీవచ్ఛవంలా అయిపోయేడు తను.

చేతిలోని డబ్బుల్తో కొన్నాళ్లపాటు కడుపుని నింపుకొన్నాడు. ఎన్నాళ్లొస్తాయి పదిహేను రూపాయలు ?

అవయిపోగానే —

ఏదైనా పని దొరుకుతుందేమోనని వీధి వీధి తిరిగేవాడు. ఏ పనీ దొరక్కపోగా, కాళ్లు పీకేవి. కడుపుని మాత్రం చండాగ్నిలా ఆకలి దహించివేసేది.

ఏ హోటలు ముందో పిచ్చివాడిలా నిలబడేవాడు. హోటలు మెట్లు దిగిన ప్రతీ వ్యక్తిముందూ చేయి చాపి దీనంగా యాచించేవాడు. ఒకో అప్పుడు ఆ చాచిన చేతిలో ఏ చిల్లర డబ్బులో పడేవికూడాను. లేదా, ఏ రాత్రికో హోటళ్లోంచి ఎంగిలాకులు ఎగిరి



పడితే, కుక్కలని అదిలించి, వాటిని ఆశగా అందుకునేవాడు. క్షుద్బాధ తీర్చుకునేవాడు.

ఇంత పెద్ద ప్రపంచంలో తన చిన్న పొట్టని కొట్టిన శక్తి ఏదా అని అనుక్షణం ఆలోచనలో మునిగిపోయేవాడు.

రాములికి ఈమధ్య మళ్లీ దగ్గూ ఆయాసం వస్తున్నాయి. గోనె పరుచుకుని చెమ్మగా వుండే నేలమీద పడుకోడంతో — రోజు రోజుకీ శరీరం నీరసించిపోసాగింది.

* * *

''మావయ్యా, అదేమిటి ?''

''దాన్ని క్షితిజం అంటారు.''

''అన్నట్టు మావయ్యా, భూమీ — ఆకాశం ఎక్కడ కలుసుకుంటాయి ?''

''కలుసుకోవు. కలుసుకున్నట్టు మామూలు మానవ నేత్రాలకి కన్పిస్తాయి.''

''వాటిని చూస్తే — నా కేమనిపిస్తుందో తెలుసా ?''

''ఏమనిపిస్తుంది ?''

''నేను భూమినీ, నువ్వు ఆకాశానివీ అయినట్టు. మనం కలిసినట్టు వున్నా — ఎప్పటికీ నిజంగా కలియనట్టు !''

''ఛ. పిచ్చిపిల్లా... అదేం కాదు ! మనం ప్రపంచానికి కొత్త అర్థం ఇస్తాం. ఇస్తున్నాం.''

''ఒకో అప్పుడు నా గురించి తలుచుకుంటే నాకే ఏడుపు వస్తూ వుంటుంది...''

''రజనీ, ప్లీజ్...''

''సరేలే మావయ్యా !''

''నీ కంటి నుండి జారిపడే నీళ్లని చూడలేను రజనీ !''

''సరేలే అన్నాగా మావయ్యా ! అపురూపమైన ఈ కన్నీటి ముత్యాల్ని ఇప్పుడే ఖర్చు పెట్టేస్తే ఎలా? మున్ముందు వీటితో ఏం అవసరం వస్తుందో !''

''అదిగో మళ్లీ... !''

* * *

చలిగాలి రివ్వున వీస్తోంది.

చలికి ఎముకలు శరీరాన్ని కుదిపేస్తున్నాయి.

ఖంగు ఖంగుమని దగ్గుతూ పై కప్పు వేపు చూశాడు రాములు.

ఆయాసం ఏ మాత్రం తగ్గుముఖం పట్టడం లేదు. క్షణ క్షణానికీ దగ్గు వస్తోంది.

దగ్గ లేక — దగ్గడానిక్కూడా శక్తి లేక — నీరసంగా బల్లిలా గోడకి అంటుకుపోయి కూర్చున్నాడు.

గవరయ్య బుగత...చుక్కమ్మ...

ధర్మయ్య...దాలమ్మ...



వీళ్లందరూ అతని కంటిముందు నిలబడి నట్టయింది.

అందరూ ఒకే ప్రశ్న వేస్తున్నారు.

'ఇంకెందుకురా, ముసిలోడా నీకు బతుకూ ?'

అంటూ నవ్వుతున్నారు.

పకపక పకపక

వికవికమంటూ నవ్వుతున్నారు.

అదుర్తోన్న ఛాతీని రెండు చేతుల్తో అదుముకుని గోడకి చేరబడ్డాడు రాములు.

*　　*　　*

మద్రాసు, మైసూరు, మహాబలిపురం, బెంగుళూర్ తిరిగి వచ్చేరు రవి, రజని. చివరి మకాం విజయవాడలో వేశారు.

మర్నాటి వుదయం ట్రెయిన్‌కి రజని విశాఖ పట్నం వెళ్లిపోతుంది. రవి హైదరాబాద్ వెళ్లిపోతాడు. అదే వారి దారులు చీలే స్థలం.

సాయంకాలం కనకదుర్గ గుడికి వెళ్లొచ్చేక రాత్రి భోజనం ముగించి తాంబూలాలు నములుతూ కూర్చున్నారు. ఒకరి నొకరు ఎంత చూసుకున్నా తనివి తీరడం లేదు. రాత్రి పన్నెండు కావస్తోంది. ట్యూబ్ లైట్ తీసేసి, జీరోవాట్ బల్బ్ వేశాడు రవి. నీలం రంగు కాంతి గదంతటా పల్చగా పరుచు కుంది. కుర్చీలో కూర్చొని తనను చూస్తూ ఏదో ఆలోచిస్తోన్న రజనిని దీక్షగా చూశాడు రవి.

"బట్టలు మార్చుకు వస్తాను..." అంటూ లేచింది రజని.

ఆమె వెళ్తూంటే మౌనంగా ఆమెనే పరికించాడు రవి. చేతులు కట్టుకుని నిశ్శబ్దంగా నిశ్చలంగా ఒంటరిగా కూర్చుండిపోయాడు. హృదయం ఏదో ఆందోళనగా స్పందించసాగింది. దెబ్బతిన్న క్రూర మృగంలా అతనిలోని అహంభావం ఏదో లేవలేక పడు కుంది. తరంగాల్లా వివిధమైన ఆలోచనలు అతని మస్తిష్కాన్ని చుట్టుముట్టేయి. నరాల్లో వేడిరక్తం ప్రవహించడం ప్రారంభించింది... అంతలోనే అతని మొహం మీాద చిరునవ్వు వెలిగింది.

చెట్లని చుంబించే మెరుపుల్లా అతని చూపులు ఆమెను చుట్టుముట్టేయి. ఆమె కళ్లలోని చిరు తడిని చూసి అతను చలించిపోయేడు. ఇప్పుడతని చూపులు వుందా లేదా అన్నట్టున్న ఆమె నడుంమీద నిలిచేయి. నిశ్శబ్దంగానూ, ఎంతో కొత్తగానూ కని పిస్తోన్న రవిని వింతగా చూసింది రజని.

నెమ్మదిగా నడిచివచ్చి అతనికి ఎదురుగా నిల బడింది. తెల్లగా మెరుస్తోన్న సిల్కు జాకెట్, చీరా, రజని అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి. పల్చని నీలం రంగు కాంతిలో తెల్లని వస్త్రధారణతో — నడిచి వస్తోన్న వెన్నెల్లా వుందామె. ఆమెను చూస్తూ వుంటే అతనలోని పురుషత్వం ఆకలిగొన్న జంతువులా పిచ్చిగా అరవసాగింది. ఆ వూహ రాగానే, తలెత్తి స్నిగ్ధ సుందరమై అమాయకంగా వున్న రజని మొహం చూసి సిగ్గుతో తలవంచాడు రవి. నెమ్మదిగా అతని భుజాల మీద చేతులు వేసింది. దృఢంగా, చెక్కినట్టున్న అతని మెడనీ, అక్కడున్న కాలర్‌నీ చూసింది. ఓ చేత్తో కాలర్ సవరించి రెండో చేత్తో అతని నుదురుమీాద ఏవేవో పిచ్చి గీతలు గీసింది.　[ఇంకా వుంది]

# అభివ్యక్తం



**లతిక**

రెండో శనివారం. సెలవురోజు. మధ్యాహ్నం భోజనాలయేయి. అర్ధాంగి సౌందర్య కునుక్కి ఉపక్రమించింది.

నాకు మధ్యాహ్నం నిద్ర రాదు. సెలవు రోజుల్లో మధ్యాహ్నం గడవడం కష్టంగా ఉంటుంది. ఎరట్లో పని మనిషి గిన్నెలు కడుగుతున్న శబ్దం, పడగ్గదిలో ఫేను తిరుగుతున్న శబ్దం, నిద్రలో ఇటూ అటూ వొత్తిగిలేటప్పుడు సౌందర్య గాజులు సవ్వడి మినహా అంతా నిశ్శబ్దంగా వుంది. ముందు వరండాలో ఈజీ ఛెయిర్‌లో పవళించి కొత్తగా వచ్చిన నవల చదువుతున్నాను.

కథ కదలడంలేదు. సిగరెట్టు వెలిగించడానికి అగ్గిపుల్ల గీసేను మంట నిశ్చలంగా వుంది. సిగరెట్టు పొగ సరళరేఖలో మీదకి వెళ్తోంది. కదలని గాలిలో వెలిగే జ్యోతి కాంతిని బ్రహ్మానందంతో ఎందుకు సరిపోల్చారో నాకు సిగరెట్టు సేవించి తన్మయమవడంలో అనుభవమయింది.



కళ్లు కొంచెం మూసుకుని అలా ఆలోచనలో పడ్డాను. కారు హారను వినిపించింది.

వెంకటేశ్వరరావుగారు! — ఎదురుగా వెళ్లి, విష్ చేసి, తీసుకొచ్చి, ఆయనకి పడక్కుర్చీ యిచ్చి, పక్కనున్న కుర్చీలో నేను కూర్చున్నాను. ఇవన్నీ యాంత్రికంగా జరిగేయి. మనసు మాత్రం ఆయన అసాధారణమైన రాకకి కారణాలు వెదుకుతోంది. సాయంత్రం యెలాగూ క్లబ్బులో కలుస్తాం. ఈలోగా అవసరమైతే, రమ్మని కబురు చేస్తే నేనే వెళ్లేవాణ్ణి. తనంత తను వచ్చేరంటే ఏదో రాచకార్యం వుండి వుండాలి.

కాఫీ పెట్టమని సౌందర్యతో చెప్పడానికి లోపలికి వెళ్లబోయాను. "అమ్మాయి పడుకున్నట్టుంది. డోం(ట్) డిస్టర్బ్ హర్! నీతో చాలా ముఖ్యమైన పనుండి వచ్చేను." అన్నారు ప్రారంభిస్తూ!

'చెప్పండి" అన్నాను సిగరెట్ పేకెట్టు అందించి. "క్లబ్ ఏనివర్సరీ అనుకున్నాం కదా! సోషల్ వెల్ఫేర్ మినిష్టరుగా రొస్తున్నట్టు తెలిసింది. అంచేత ఏర్పాట్లు అవీ కాస్త ఘనంగా చేదామని... సత్యానందం, వేణుగోపాలరావుగారూ ఈ సంవత్సరం ఒకరికి విశిష్ట సేవాపతకం యిద్దామని, అది మినిష్టరుగారిచేత ప్రజెంట్ చేయిద్దామని ప్రపోజ్ చేసేరు. మనూళ్లో యిలాటిది చెయ్యడం ఇదే మొదటిసారి. ఈ గౌరవం మొదటిసారి పొందడానికి డిజర్వింగ్ ఒకే ఒక్కరు..."

'అప్పగారు' నా దృష్టిపథంలో మెదిలారు. ఆయన పేరు రామ్మూర్తిగారు. ఆయనకి నేనంటే అభిమానం, సౌందర్య అంటే ముద్దు. ఆమెను చిట్టితల్లి అని, నన్ను బాబ్జి అని పిలుస్తారాయన. నేనీనాడు మంచి స్థితిలో జీవితం గడపడానికి ఆయన చేసిన ఉపకారాలు మరువరానివి. నాలాటి ఎందరికో ఆయన దైవసమానుడు.

"రామ్మూర్తిగారి కిద్దామని అందరం నిర్ణయించుకున్నాం. తీరా ఆయన వద్దంటున్నారు." ముగించేరు వెంకటేశ్వరరావుగారు.

"లాంఛనంగా వద్దన్నారేమో ?"

"సరిపోయింది. లాంఛనంగా కాదనడం వేరు! ఆయన నిజంగానే ఒప్పుకోడంలేదు."

ఆయన కాదంటే ఒప్పించడం సమస్యే! ఆలోచనలో పడ్డాను నేను. దారినపోయే కుర్రాళ్లు కొంటెతనంగా కారు హారను మ్రోగించేరు. సౌందర్య నిద్ర తేలిపోయింది. లేచి ఫేను కట్టేసింది.

"వెంకటేశ్వరరావుగారొచ్చేరు" లోపలికి వినిపించేలా చెప్పాను. కర్టెను తొలిగించి వరండాలోకి వచ్చింది సౌందర్య!

"నమస్కారమండీ!"

"బాగున్నావా అమ్మాయ్ ?"

"బాగున్నాను. ఇప్పుడే వస్తా నుండండి" అంటూ ఇంట్లోకి వెళ్లిందామె. వెంకటేశ్వరరావుగారు మళ్లీ చెప్పసాగేరు.

"... ఇదీ సమస్య! ఆయన కాదంటే ఆయన్ని వొప్పించడం కష్టమే ననుకో... అయినా నువ్వోసారి ట్రై చెయ్యి"

"షూర్ షూర్! మీరు చెప్పాలా ? ఆయనకి సన్మానమంటే, మా కంటె ఎక్కువగా యెవరూ ఆనందించరేమో!"

"అందుకే నీ కోసం వచ్చింది."

"ఎందుకు మేట్నీకా" అంటూ సౌందర్య ప్రవేశించింది ట్రేలో రెండు కాఫీ కప్పుల్తో.

"ఇప్పుడివన్నీ ఎందుకు చేసేవమ్మాయ్ ?"

"మీకు థియేటర్లో మంచి కాఫీ దొరకదని!"

"తల్లీ! నీ మొగుణ్ణి నేను సినిమాకి తీసుకెళ్లడానికి రాలేదు. ఒకవేళ తీసుకెళ్లినా హిత్యువర్ మెజస్టీస్ పర్మిషన్ ఓన్లీ."

"అయితే మరో కాఫీ యిస్తాను."

"అది మీ మేరేజేనివర్సరీకి రిజర్వు చెయ్యి. అన్నట్టు మీ పెళ్లి పండుగ ఈ నెల్లోనే కాబోలు ?"

"మీకు గుర్తుందే! మీ ముందున్న పెద్దమనిషి నడగండి, పెళ్లయి ఎన్నాళ్లయిందో!"

"పన్నెండేళ్లు కదా!" నా సమాధానం.

"గుడ్ ! వివాహ పుష్కరోత్సవ మన్నమాట ! అయితే ఈసారి గ్రాండ్‌గా చెయ్యాలి ! ఇంతకీ ఎప్పుడట ?"

"ట్వెంటీ థర్డ్‌న" వెంటనే చెప్పేను. లేకపోతే సౌందర్య దెప్పుతుంది, పెళ్ళిరోజు గుర్తు లేదని !

"క్లబ్బుది ప ద హా రు నుకుంటున్నాం" అన్నారు వెంకటేశ్వరరావుగారు.

"ఏవిటి పెళ్ళిరోజా ?" జోక్ చేసింది సౌందర్య.

నవ్వులు పూర్తయ్యేక వెంకటేశ్వరరావుగారు మళ్లీ ప్రారంభించేరు "... రామ్మూర్తిగారొప్పు కుంటే, జీవిత విశేషాలు వగైరా సూవెనార్‌లో వెయ్యాలి. టైం తక్కువగా వుంది. అంచేత తొందర్లో ఆయన్ని కలుసుకుని, ఒప్పించే డ్యూటీ నీది."

"డ్యూటీ నాదేననుకోండి..."

"పూచీ మాత్రం కాదంటావ్..."

"పూచీ నాది. ఒప్పిస్తే నాకేం ప్రజెం టిస్తారు ?" కలగజేసుకుంటూ అడిగింది సౌందర్య !

"సౌందర్యా ! పూర్తిగా వినకుండా..."

"విన్నాను. మీ అప్పాగారికి సన్మానం ఆయన ఒప్పుకోలేదు. అంతేకదా ! నే నొప్పిస్తాను."

"మా క్కావలసిందదే" అన్నారు వేంకటేశ్వర రావుగారు.

"అయితే రెండు షరతులు."

"ఆయ న్నొప్పించు. ఎన్ని షరతులైనా మేం రెడీ."

"ఒకటి, మొదట మీరడిగినప్పుడు కాదన్నారని ఆయన్ని తేలిక చేసి మాట్లాడకూడదు."

"కలలో కూడా మాట్లాడం — రెండోది ?"

"ఆయన్ని నొప్పించడం కోసం నే నేదైనా ప్రోగ్రాం ప్లాన్ చేస్తే కేరీ అవుట్ చెయ్యాలి."

"బై ఆల్ మీన్స్. ఈ విషయంలో నీకు అన్ని స్వతంత్రాలూ యిచ్చేం ! నువ్వేం చేసినా మా కంగీకారమే. సరేనా ?"

"హార్టీలీగా కంగ్రాచులేట్ చెయ్యడానికి సిద్ధంగా వుండండి."

ప్రతి మనిషిలోనూ హృదయపు లోతులలో సున్నితమైన భావాలు చోటు చేసుకుని వుంటాయి. కావలసినవాళ్లు అచ్చమైన ప్రేమ, అభిమానం, గౌరవం మొదలయిన గుణాలతో ఆ హృదయాంత రాళాన్ని స్పందింపజేస్తే — ఆ వ్యక్తి ద్వారా మనకు కావలసిన పనులు నెరవేర్చుకోవచ్చు. అప్పాగారిలో సౌందర్యకి అలాటి 'సాఫ్ట్ కార్నర్' వుంది. తను ఒత్తిడిచేస్తే ఆయన అంగీకరిస్తారని ఆమెకి దృఢమైన నమ్మకం. ఆ నమ్మకంతో ఆమె వ్యవహార రంగంలో ప్రవేశించబోతున్నది.

## 2

ధనవంతులు తమ ఆస్తులకి తాము ధర్మ కర్తలుగా వ్యవహరించి, ప్రజాహిత కార్యాలకోసం, తమ సంపాదన వెచ్చించాలన్న ఆదర్శాన్ని పాటిస్తున్న వ్యక్తి రామ్మూర్తిగారు. సామాన్య కుటుంబంలో పుట్టి స్వశక్తిమీద పైకి వచ్చేడాయన. ఆయన తనకి వుంచుకున్నది ఒక పెంకుటిల్లు మాత్రమే. రెండు బస్సులు, ఒక చిట్‌ఫండ్ కంపెనీ, మామిడి తోటలమీద ఆదాయం — ఈ సంపాదనలో చాలా భాగం బీద విద్యార్థుల ఆర్థిక సహాయానికి, తదితర సత్కార్యాలకీ వినియోగిస్తున్నారు. అన్ని వర్గాల ప్రజల ఆదరాభిమానాలతో చాలా ఏళ్లుగా మా వూరు పురపాలక సంఘానికి ఆయన ఉపాధ్యక్షులుగా పోటీ లేకుండా ఎన్నుకోబడుతున్నారు.

స్వాతంత్ర్యం రాకముందు, జిల్లా స్థాయిలో కాంగ్రెసు మీటింగ్ జరిగినప్పుడు ఆ మీటింగు జరగకుండా చెయ్యడానికి జస్టిస్ పార్టీ ప్రముఖులు ఎన్నో అవరోధాలు కలిగించేరట. వీటన్నిటికీ ఎదురు నిలిచి కాంగ్రెసు కార్యకర్తల సమావేశం కోసం, భోజన వసతి సదుపాయాల కోసం, ఎన్నో వ్యయ ప్రయాసల కోర్చి, ఆ మీటింగు దిగ్విజయంగా ఆయన నిర్వహించిన తీరు; వయస్సు మళ్లినవాళ్లు ఈ నాటికీ కథలుగా చెబుతూ వుంటారు. ఆయన నిగర్వి. నిరాడంబరజీవి. పరోపకార పరాయణుడు, వ్యసనాలకి లొంగనివాడు, విద్యాధికుడు కాకపోయినా మంచి సంస్కారం గల వ్యక్తి...

లాయర్లు, డాక్టర్లు, కాలేజీ లెక్చరర్లు, ఉన్నతోద్యోగులు, ప్రముఖ వాణిజ్యవేత్తలు ప్రకాశం జూబ్లీ క్లబ్‌లో సభ్యులు. వెంకటేశ్వరరావుగారు క్లబ్బు సెక్రటరీ. ఆయన వచ్చి వెళ్లిన మర్నాడు ఉదయాన్నే నేనూ, సౌందర్యా రామ్మూర్తిగారింటికి బయల్దేరాం.

"రండి రండి, చిట్టితల్లి కూడా బయల్దేరి వచ్చిందంటే ఏదో దండయాత్ర వుందన్న మాటే" నవ్వుతూ ఆహ్వానించేరు రామ్మూర్తిగారు. నేనూ సౌందర్యా లోపలికి వెళ్లేం. రామ్మూర్తిగారి కోసం వచ్చినవాళ్లు సెలవు తీసుకుని వెళ్లిపోయారు.

"అజాత శత్రువుల మీదికి దండయాత్ర చేసి ఏం ప్రయోజనం ? అగ్ర తాంబూల మిచ్చి గౌరవిస్తామని ఆహ్వానించడానికి వచ్చేం" ప్రస్తావించింది సౌందర్య.

"శుభం ! బర్త్‌డే పార్టీయా ?"

"మీ బాబ్జీ చెప్తారు."

"ఏవిటి బాబ్జీ విశేషం ? చిట్టితల్లేమైనా అలికిడి..."

ఆమె సిగ్గుపడింది.

"అదేం కాదప్పాగారు ! ఇరవైమూణ్ణ మా మేరేజ్ ఏనివర్సరీ. ముందు చెప్పకపోతే మీరు మళ్లీ ఏవైనా ఎంగేజ్‌మెంట్లు ఫిక్స్ చేసు కుంటారని..."

"ఫిక్స్ అయితే మాత్రం, వేళకి రాకపోతే చిట్టితల్లి వూరుకుంటుందా ? తప్పకుండా వస్తాను."

"మేం యిద్దరం వచ్చిన పని యిది. నేనింకో పనిమీద వచ్చేను" సౌందర్య ప్రారంభించింది.

"చెప్పమరి"

"చాలా ముఖ్యమైన పని."

"చిట్టితల్లి వచ్చిందంటేనే చాలా ముఖ్య మైన పని. మీ పెళ్లి పండక్కి ముఖ్య అతిథిగా గొప్పవాళ్లెవరినేనా ఆహ్వానించడానికి నేను వెళ్లాలా ?"

"మీరే ఛీఫ్ గెస్ట్ !"

"మరింకేవిటి ?"

"మేమొక మహిళా సమాజం ప్రారంభిస్తున్నాం. ప్రారంభోత్సవం సభకి మీరు అధ్యక్షత వహించాలి"

"గాయత్రీదేవిగారయితే బాగుంటుందని నా ఉద్దేశం."

"మీరే అధ్యక్షత వహించాలి. తప్పదు. తర్వాత ఒక చిన్న సన్మానం వుంటుంది. సన్మాన మంటే—"

"శాలువా కప్పుతారు. పర్సు ప్రజెంట్ చేస్తారు."

"మావయ్యగారి అంచనా తప్పు. అవన్నీ మామూలివి. మా కార్యక్రమంలో అన్నీ కొత్త కొత్త ఐటమ్స్ వుంటాయి."

"పాతకాలపు వాళ్లం. మాకవన్నీ ఎట్లా తెలుస్తాయి ? నువ్వు చెప్తే తెలుసుకుంటాం."

"ఒట్టి తెలుసుకోడం కాదు, మా కార్యక్రమానికి మీ ఆమోద ముద్ర కావాలి. ఈ సమాజానికి నేను కన్వీనర్ని. ఓ కమిటీ ఫార మయేదాకా అన్నీ నేనే. అంచేత నేను తలపెట్టిన పనులు దిగ్విజయం కావడానికి మీ అండదండలు కావాలి."

"నువ్వింతగా చెప్పాలా అమ్మాయ్ ! అన్ని విషయాల్లో నా చేతనైనది నేను చేస్తాను"

"అదిగో ! నా చేతనైతే — అంటూ రాజకీయం ప్రారంభించేరు. మీకు నచ్చకపోతే, ఆ పని నావల్ల కాదమ్మాయి అని తప్పించుకుందికి."

"మీ హృదయాల్లో నాకొక గొప్ప స్థానం వుండొచ్చు. కాని నేను సర్వ సమర్థుణ్ణి కాదు కదా ?"

"మా మెంబర్లంతా మీలాటివాళ్లే ! వాళ్లందరికీ మీరంటే మంచి అభిప్రాయమే. ఆ గౌరవం అభివ్యక్తం చెయ్యడానికే ఈ సన్మానం. సభ్యులందరికీ నేను మాట యిచ్చేను, చిట్టితల్లి మాట మీరు కాదనరనే భరోసాతో ! అంచేత మీరు నా మాట నిలబెట్టాలి."

"తప్పకుండా ! అంత నమ్మకంతో నువ్వు మాట యిస్తే నీ మాట పొల్లుపోనిస్తానా ? ఇంతకీ అదేవిటో చెప్పమరి !"

"మేమంతా మీవాళ్లం. మీ గొప్పదనం సమాజంలో గుర్తింపబడితే మాకందరికీ తృప్తిగా వుంటుంది. అంచేత మీకు విశిష్ట సేవా పతకం

(30వ పేజీ చూడండి)



### డూండీగారి చిత్రం !

పూర్తయిన విషయాన్ని, ఆయన ద్వారా తెలుసుకొన్నాను. ఎన్నో చిత్రాలకు అజ్ఞాత శక్తిగా వుపయోగపడిన డూండీగారు ప్రప్రథమంగా దర్శకత్వం నిర్వహించిన యీ చిత్రంలో కృష్ణ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ అని చెప్పొచ్చు. వైవిధ్య స్వభావం గొన్న తండ్రిగా, తనయుడిగా కృష్ణ అనమానంగా నటించినట్టు తెలిసింది. హీరోయిన్‌గా వాణిశ్రీ తన ప్రతిభను, ప్రతాపాన్ని ప్రదర్శించింది. ఒక గమ్మత్తయిన భూమికను ప్రభాకరరెడ్డి ధరించారు. చిన్న పాత్రను శుభ మిన్నగా నటించింది. సహాయ పాత్రలను రాజబాబు, శరత్‌బాబు, మాడా, ఎస్వరలక్ష్మి, ముక్కామల, సీతారాం పోషించారు.

మాటల మాధుర్యానికి రామలక్ష్మి, సంగీత సుగంధానికి చక్రవర్తి, ఛాయాగ్రహణ వైభవానికి దేవరాజ్‌గార్ల కృషి ఆ శాఖల్లో అగుపిస్తుంది.



"సత్యానికి సంకెళ్లు"లో కృష్ణ, వాణిశ్రీ

వెరైటీ కథలను అపేక్షించే ఆంధ్ర ప్రేక్షకులకు నిర్మాతలు బాబ్జీ, సాంబశివరావుగార్ల యీ ప్రయత్నం సంతృప్తి నిస్తుంది శ్రీ ఫిలింస్ విడుదల

ఈ చిత్రం రషస్ చూసినవాళ్లు సెహభాష్ కృష్ణ అని ప్రశంసించారు డూండీగారి పనితనాన్ని శ్లాఘించారు

### కృష్ణకు మరొక వెరైటీ !

హీరో కృష్ణ ధరిస్తున్న పాత్రలలో వెరైటీ కనిపించాలన్న తలంపు ఆయనకు వుండబట్టే, కథల ఎంపికలో చాలా జాగ్రత్త వహిస్తున్నారు ఆయనకు బాగా నచ్చిన వేషం వున్న చిత్రాన్ని నవచిత్ర ఎంటర్ ప్రైసెస్‌వారి ఈస్ట్‌మన్‌కలర్ చిత్రంలో చూడొచ్చు ఈ చిత్రానికి ఎమ్. మల్లికార్జునరావు దర్శకుడు గాబట్టి, చిత్రంలో కాంప్రమైజ్ ప్రసక్తి వుండదు చిత్రం ఆద్యంతం కృష్ణ పాత్రకు ప్రాధాన్యత వున్నదని ఆయన చెప్పగా తెలిసింది. ఈ చిత్రానికి మహారథి మాటలను, సత్యం సంగీతాన్ని, కళాకర్ ఆర్టును నిర్వహిస్తున్నారు. అక్టోబరు యిరవై ఎనిమిది నుండి షూటింగు అరంభం.

హీరో కృష్ణ సరసన మంజుల, అత నటించడం వల్ల గ్లామర్‌కి కొరత వుండదు. ప్రధాన పాత్రలను కాంతారావు, సత్యనారాయణ, అంజలీదేవి, రాజబాబు, చంద్రమోహన్ పోషించడం వల్ల నటనా ప్రమాణం గూర్చి వ్రాయ పనిలేదు.

మల్లికార్జునరావు — కృష్ణ కాంబినేషన్‌లో మంచి చిత్రం రావాలని కాంక్షిస్తున్నాను. నవయుగ విడుదల.

### ఆదుర్తి చిత్రంలో కృష్ణ వేషం

ఇంతవరకు విజయం తప్ప మరొక శబ్దాన్ని చవిచూడని ఆదుర్తికి యిప్పటికీ ప్రజలలో వుండే కీర్తి అనమానము. హీరో చిత్రాల కుండే క్రేజ ఆదుర్తి దర్శకత్వం చేసే చిత్రాలకు వున్నది.

"మాయదారి మల్లిగాడు" చిత్రంలో కొత్త కృష్ణ కనిపించాడు. బలేగా చేశాడు ఇప్పుడు నిర్మితమయ్యే చిత్రంలో మరొక రకం వేషంలో కృష్ణ గొప్పగా నటిస్తున్నాడు. రవి కళా మందిర్ తయారు చేస్తున్న యీ చిత్రంలో వెరైటీకృష్ణతో బాటు కొత్త తార జరీనా ప్రేక్షకులకు కనువిందు చేస్తుంది ఇతర పాత్రలను అంజలీదేవి, కాంతారావు, రాజబాబు, గిరిబాబు, మాడా, సూర్యకాంతం, ధూళిపాళ లాంటి అనుభవజ్ఞులు పోషిస్తున్నారు

మాటలకు సత్యానంద్, సంగీతానికి మహదేవన్, ఛాయాగ్రహణానికి రామకృష్ణరావు, కళకు తోట, కూర్పుకు హరినాథ్ లాంటి వుద్దండులు వున్నారు చిరంజీవి ప్రసాద్, హరనాథ్ తలపెట్టిన యీ మంచి కార్యానికిమేలుజరుగుగాక ! శ్రీఫిలింస్‌విడుదల

### "కొత్త కాపురం"లో కొత్త వేషం

ప్రసన్న లక్ష్మి పిక్చర్స్‌వారి "కొత్త కాపురం" చిత్రాన్ని చూశాను ఇందులో పాలేరుగా కృష్ణ పసందుగా నటించారు గెటప్‌లో కొత్తదనం, పాత్ర స్వభావంలో నూతనత్వం, పాత్ర పోషణలో వైవిధ్యం అగుపించింది పి చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో తయారయ్యే యీ చిత్రానికి బొల్లిముంత రచనకు, మహదేవన్ సంగీతానికి, లక్ష్మణగోరే ఛాయాగ్రహణానికి, మహేశ్వరరావు కూర్పుకు, బ్రహ్మం సహాయ దర్శకత్వానికి ఆధిపత్యం వహిస్తున్నారు

మహా నటుడు రంగారావు ధరించిన పాత్రను క్యారెక్టర్ ఆర్టిస్ట్ గుమ్మడి తన ప్రత్యేకతతో గొప్పగా పోషిస్తున్నారు ఈ చిత్రంలోని ముఖ్య పాత్రలను భారతి, పద్మనాభం, రాజనాల, మిక్కిలినేని, చంద్రమోహన్, కృష్ణకుమారి, అనిత, రమాప్రభ, హేమలత మరియు సూర్యకాంతం ధరిస్తున్నారు ఈ చిత్రానికి వెంకటరత్నం నిర్మాత

హీరో వేషం చాలా విశిష్టమైనది అన్నం పెట్టిన వ్యక్తిని, ఆయన కుటుంబ గౌరవాన్ని కాపాడిన పుత్రుడి పాత్రను కృష్ణ పోషించే యీ చిత్రానికి పూర్ణా పంపిణీదారులు

### రాజకుమార్ పాత్రలో కృష్ణ

కన్నడ రాజకుమార్ నటించిన మహోన్నతమైన 'బంగారద మనుష్య" చిత్రం యొక్క తెలుగు రూపంలో అదే పాత్రను కృష్ణ పోషిస్తున్నారు ఈ చిత్రాన్ని పూర్ణిమ పిక్చర్స్ అధినేత డి ఎస్ రాజు యీస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్నారు

రాజకుమార్ అద్భుతంగా నటించడం కూడా ఆ చిత్రం ఏడు వందల రోజులు ఆడడానికి ముఖ్య కారణం అన్నది అబద్ధం గాకపోతే, మన కృష్ణ కూడా అద్వితీయంగా నటించి చిత్ర విజయానికి దోహదం చెయ్యగలరన్న నమ్మకం నాకు వున్నది ఈ చిత్రానికి డి వి నరసరాజు మహదేవన్, గోఖలే, జి కె రాము లాంటి నిష్ణాతులు సాంకేతిక శాఖలకు అధిపతులు కాగా, సి ఎస్ రావు లాంటి మహా వీరుడు దర్శకుడు కాగా చిత్రం సర్వజన ఆకర్షణీయంగా వస్తుంది అనడంలో అనుమానం లేదు

ఈ చిత్రంలో షావుకారు జానకి, మంజుల, చంద్రమోహన్, ధూళిపాళ, రాజబాబు, ప్రభాకర రెడ్డి ముఖ్య పాత్రధారులు ఈ చిత్రం తారకరామ, శ్రీ తారకరామ, నవభారత్ సంస్థల ద్వారా పంపిణీ అవుతుంది

### జగదీష్‌కి ప్రమోషన్ !

చిత్ర నిర్మాణంలో అతి ముఖ్యమైన బాధ్యతను నిర్వహించే వ్యక్తి ఎడిటరు కూర్పు చెయ్యడంలో నేర్పు లేక దెబ్బతిన్న చిత్రాలు లేకపోలేదు తెలుగు చిత్ర సీమకు వన్నె తెచ్చే ఎడిటర్ల లిస్టులో జగదీష్ ఒకరు ఈయనకు ప్రమోషన్ వచ్చింది అదేమిటన

సౌంధ్యశ్రీ కంబైన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబోయే చిత్రానికి దర్శకుడు గావడమే ఈ సంస్థకు పి త్రివాధరావు అధినేత త్రిపురనేని మహారథి రచయిత

ప్రధాన పాత్రలను కృష్ణ, జగ్గయ్య, మంజుల, సత్యనారాయణ పోషిస్తున్నారు విజయదశమినాడు పాటొకటి రికార్డు చెయ్యబడింది శంకర్ సంగీత సారధి

### శంకర్‌కి సిఫారసు !

మంచిని, విద్వత్తు వున్న వ్యక్తులను సిఫారసు చెయ్యడంలో తప్పు లేదు సంగీత దర్శకుడు శంకర్‌కి నే చెప్పిన రెండూ వున్నాయి గాబట్టే పరిశ్రమలో పలుచోట్ల సంగీతానికి శంకర్ పేరును సిఫారసు చేస్తున్నారేమో అనిపిస్తుంది



"ఎవరికి వారే యమునాతీరే"లో
సత్యనారాయణ, రోజారమణి

### విశ్వభారతి ప్రొడక్షన్స్

ఎన్నో కథలను అనుకొని, చివరికి ఒక వుదాత్తమైన యితివృత్తానికి ఓటు వెయ్యడం జరిగింది. ఈ సంస్థ అధినేత జి. రాధాకృష్ణమూర్తి, రచయిత రెంటాల, దర్శకుడు దాసరి నారాయణరావు షుమారు వంద కథలపై చర్చ జరిపారు.

### సూర్యుడు – చంద్రుడు

ఎన్నుకున్న కథకు యిడిన పేరు యిది. సూర్యుడు గుడ్డివానికి వర్తిస్తుంది. చంద్రుడు అవిటివానికి అన్వయిస్తుంది. ఒక అంధుడు, ఒక కుంటివాడు జీవితంలో ఎదుర్కొన్న సమస్యల సారమే విశ్వభారతి ప్రొడక్షన్స్ ఎన్నుకొన్న యితివృత్తం.

డిశంబరు పదకొండు నుండి హైద్రాబాద్ సారథీ స్టుడియోలో షూటింగు ప్రారంభమయ్యే యీ చిత్రానికి రెంటాల గోపాలకృష్ణ మాటలను, శంకర్ సంగీతాన్ని సమకూరుస్తారు. సినిమా అనువాదాన్ని, దర్శకత్వాన్ని దాసరి నిర్వహిస్తున్నారు. ఒక వంగ కథ ఆధారంగా నిర్మితమయ్యే యీ చిత్రంలో కొందరు కొత్తవాళ్ళు ముఖ్య పాత్రలను పోషించే అవకాశం కనిపిస్తున్నది. [illegible] కృష్ణకుమారి, సత్యనారాయణ, నిర్మల లాంటి పాతవాళ్ళు కూడా వుంటారు. నవయుగ విడుదల.

### కాశ్మీరులో కృష్ణ – వాణిశ్రీ

అక్టోబరు యిరవై నుండి చివరి రోజు వరకు పదకొండు రోజులు కృష్ణ, వాణిశ్రీ కాశ్మీరులో మకాం పెట్టారు. ఈ యిద్దరూ ఆడూతూ, పాడుతూ ఆలాపించిన ప్రేమగీతం అక్కడి సుందర ప్రదేశాల నడుమ చిత్రీకరించబడింది.

మహాకవి ఆత్రేయ రాసిన, చక్రవర్తి బాణీ కూర్చిన,సుశీల—బాలుపాడినపాటను తెలపమంటారా?

"ఊరూ, పేరూ లేనివాణ్ణి ప్రేమించనా
ఓనమాలు దగ్గరుండి నేర్పించనా
దాచుకో గుండెలో
నేర్చుకో కళ్లతో" — ఈ పరవశించే ప్రేమ ఘట్టం రంజిత్ మూవీస్‌వారి రంగుల చిత్రం "చీకటి వెలుగులు"లో కనిపించి, యువ హృదయాలను దోచుకొంటుంది. ఈ చిత్రానికి కె. ఎస్. ప్రకాశరావు దర్శకుడు. కథ కూడా ఆయనదే. ముళ్ళపూడి మాటల రచయిత. కెమెరా కింగ్ స్వామి వుండ కనుల విందుకు దిగులు ఏల? కళా వైభవానికి మోహన సాక్షి.

విఖ్యాత వాణిజ్యవేత్త రంజిత్ కుమార్ భారీ ఎత్తున నిర్మిస్తున్న "చీకటి వెలుగులు" చిత్రంలో కృష్ణ, వాణిశ్రీ పోటీపడి నటించే పాత్రలు లభించాయి. పద్మప్రియకు బలే వేషం దొరికింది. ఈ చిత్రంలో వెండి తెర అతిరథ, మహారథు లందరూ గొప్ప పాత్రలను పోషిస్తున్నారు. లక్ష్మి ఫిలింస్ విడుదల చేసే చిత్రంలో కృష్ణ నటించడం విశేషం.



"ఇల్లూ—వాకిలి"లో సత్యప్రియ

## సారథీలో "స్వతంత్రం వచ్చింది"

నటుడు ప్రభాకరరెడ్డి తీసే చిత్రాలంటే ప్రజలు ప్రత్యేకతను ఎదురు చూస్తారు. వాళ్ళు వూహించే రీతిలో రెడ్డిగారు చిత్రాలను నిర్మించడానికి అలవాటు పడ్డారు.

జయప్రద మూవీస్ ఈస్ట్మన్ కలర్‌లో నిర్మిస్తున్న "స్వతంత్రం వచ్చింది" చిత్రం సంచలనం సృష్టించగల అంశాలు వున్న కథను గొనియున్నది అని చెప్పడానికి సంశయించడం లేదు. ఈ చిత్రానికి గణేష్ పాత్రో రచయిత. మద్దిపట్ల సూరి సినేరియో రాశారు. సినిమా ట్రీట్‌మెంటును, దర్శకత్వాన్ని లక్ష్మీదీపక్ చేపట్టారు. ఈ చిత్రానికి సంబంధించిన అన్ని పాటలను సత్యం రికార్డు చేశారు

గుమ్మడి నటనా ప్రాభవం గూర్చి రాయడానికేముంది? అయినా, 'స్వతంత్రం వచ్చింది' చిత్రంలో ఆయన ధరిస్తున్న పాత్ర చాలా గొప్పది అని చెప్పి తీరాలి. నాయక పాత్రధారి కృష్ణంరాజు చేస్తున్న వేషం ఆయన అంతస్తును అధికం చేస్తుంది. ఈ చిత్రంలోని ప్రధాన భూమికలను నాగభూషణం, పద్మనాభం, రాజబాబు, ప్రభాకర రెడ్డి, అల్లు రామలింగయ్య, త్యాగరాజు, రావు గోపాలరావు, షావుకారు జానకి, శుభ, ప్రభ, నిర్మల, కె విజయ ధరిస్తున్నారు.

ఈ చిత్రానికి దేవరాజ్ ఛాయాగ్రహణాన్ని, మార్తాండ్ కూర్పును, అనంతరావ్ కళను, మారి ప్రొడక్షన్ను, కేశవరావు సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. నవయుగ విడుదల.

## ఎన్నాళ్ళో కెన్నాళ్ళకు !

"నిత్య కల్యాణం — పచ్చ తోరణం" చిత్రం మనసులో మెదిలినపుడల్లా ఆ చిత్ర దర్శకుడు



# సినిమా

పినిశెట్టి జ్ఞాపకాని కొస్తారు. ఆ చిత్రం హిందీలో "దాదీమా" పేరిట అఖండ విజయాన్ని సాధించింది. ప్రజ్ఞ, ఉపజ్ఞ వున్న పినిశెట్టికి ఆ తర్వాత మళ్ళీ దర్శకత్వం చేసే అవకాశం రాలేదు. విద్వత్తుకు ఎప్పుడూ విలువ వుంటుంది. ఎనాటికైనా దాని అవసరం వస్తుంది. పినిశెట్టికి ఎంతో కాలం తర్వాత ఇప్పుడు గజపతి పిక్చర్స్ నిర్మించే "తల్లి గోదారి" చిత్రానికి దర్శకుడిగా పనిచేసే అవకాశం లభించింది. ఆద్యంతం తేట తేట తెలుగుతనం పుట్టిపడే ఈ చిత్రం గోదావరీ తీరంలో షూట్ చేయబడుతుంది.

జగ్గయ్య, షావుకారు జానకి, జయసుధ ముఖ్య పాత్రలను పోషించే ఈ చిత్రానికి రవిరాజ్ నిర్మాత. ఈ చిత్ర దర్శకుడే కథ, మాటలను గూడా వ్రాయడం జరిగింది. ఈ చిత్రానికి టి. చలపతిరావు సంగీత నిర్దేశకుడు.

## చదువు - సంస్కారం

ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ అందిస్తున్న మరొక ఆణిముత్యం రాజశ్రీ దర్శకత్వం నెరపిన "చదువు—సంస్కారం" వర్ణ చిత్రం. నిర్మాత రాఘవ ధైర్యం చేసి, రాజశ్రీకి పెద్ద బాధ్యతను అప్పగించినందుకు, ఆతగాడు తన అర్హతను బహిర్గతం చేశాడు. చిత్రం జనరంజకంగా వచ్చింది.

ఈ చిత్రంలోకూడా సత్యనారాయణ స్కోర్ చేశారన్న నిజాన్ని ప్రేక్షకులు ఒప్పుకుంటారు. రంగనాథ్ బాగా రాణించినట్టు వార్త. కొత్తమ్మాయి సునందభార్గవి గ్లామర్ వేషాలకు పనికొస్తుంది. ప్రధాన పాత్రధారులయిన గుమ్మడి, శుభ, గిరిబాబు, మాలతి, కె. కె. శర్మ, మంజు భార్గవి చక్కగా నటించారు.

"చదువు — సంస్కారం" కథకు ప్రశంసల వర్షం కురిపించాలా లేక రమేష్ సంగీతానికి ఆనంద వర్షం కురిపించాలా అన్న సమస్యను పరిష్కరించే బాధ్యతను ప్రేక్షకులకు వదిలేస్తున్నాను. ఈ చిత్రం రాఘవకు వచ్చిన పేరును యినుమడింప చేస్తుంది. రాజశ్రీకి దర్శకుడిగా పెద్ద పేరును ఆర్జించిపెడుతుంది. రంగనాథ్‌కి మంచి భవిష్యత్తును చూపిస్తుంది. ప్రేక్షకులను ఆకర్షిస్తుంది. డబ్బుల వానను కురిపిస్తుంది. తారకరామ విడుదల.

"చిన్ననాటి కలలు"లో కృష్ణంరాజు, జయంతి



## విజయదశమినాడు 'వీడని బంధాలు'

డి. సి. పాణి, డి. రవి కలిసి స్థాపించిన సంస్థయే కృష్ణరాయ పిక్చర్స్. ఈ సంస్థ నుండి వెలువడే చిత్రమే "వీడని బంధాలు" ఈ చిత్రం విజయదశమినాడు హైదరాబాద్‌లో అవుట్‌డోర్ షూటింగ్‌తో ప్రారంభమైంది. లోగడ అనిశెట్టి సుబ్బారావు, జి. విశ్వనాథ్, పి. సి. రెడ్డిగార్ల వద్ద దర్శకత్వ శాఖలో విశేషానుభవం గడించిన మధు, కె. ఎం. రెడ్డి ఈ చిత్రానికి దర్శకులు.

ఈ చిత్రం తాలూకూ రెండు పాటలను ఇటీవల ఎస్. రాజేశ్వరరావు సంగీత నిర్దేశకత్వంలో విజయా గార్డెన్స్‌లో రికార్డు చేయడం జరిగింది. "వలచే హృదయానికే తెలుస్తుంది ప్రేమ విలువ" అనే పాటను ఎస్. జానకి, కొండలి వెంకటేశ్వరరావు పాడగా, "ఆకుపచ్చని చేల నడుమ — అందాలన్నీ ఒలకబోసి" అనే పాటను రామకృష్ణ, ఎస్. జానకి పాడారు. రెండు పాటలూ సి. నా. రె. వ్రాసినవే.

పాత క్రొత్త నటీనటుల సమ్మేళనంతో తయారౌతున్న ఈ చిత్రానికి మాటలను జి. విజయరత్నం, ఛాయను లక్ష్మణ్ గోరే, కళను ఎస్. రంగారావు, కూర్పును ఎం. కె. సుందరం నిర్వహిస్తున్నారు. ఈ చిత్రం నిర్వహణను ఎల్. వి. రమణ, జె. సి. చంద్రాయుడు, ప్రొడక్షన్ బాధ్యతను డి. సుదర్శన్ చేపట్టారు

మారుతున్న ప్రజల అభిరుచికి దగ్గరగా వుండేట్టు చిత్రాన్ని మలచడానికి తీవ్ర కృషి చేస్తున్నారు యువకులైన నిర్మాతలు, దర్శకులు.

## అనుకున్నదొకటి, అయినదొకటి

"వెయ్యి అబద్ధాలు చెప్పి అయినా ఒక పెళ్లి చేసిపెట్టు" అన్నారు ఆర్యులు. పీకలమీది కొచ్చినపుడు అబద్ధం చెప్పడంలో తప్పు లేదన్నారు కొందరు పెద్దలు. కొన్ని ముఖ్యమైన పనులు తప్పని సరిగా అబద్ధం చెబితేగానీ కావు. కొంతమందికి అబద్ధం చెప్పడం సరదా. మరి కొంతమందికి అబద్ధమంటేనే అసహ్యం. కానీ ఆ అబద్ధమే ఒకరి జీవితంలో మల్లెలు కురిపిస్తుందనుకుంటే, చెప్పడానికి వెనుకాడరు. కాలం కలిసిరానపుడు ఆ అబద్ధం మూలంగా ఒకరి జీవితం నరకమయ్యే అవకాశం కూడా వుంది.

శారద సంసారాన్ని చక్కబెట్టాలని, ఆవిడ నిట్టూర్పులకు ఓదార్పును, ఓ దారిని చూపించాలని తలచి ప్రభాకరరెడ్డి నాటకం ఆడుతాడు. కానీ ఆ నాటకం విపరీతార్థాలకు దారి తీసి శారద జీవితంలో విషమ పరిస్థితులను కొనితెస్తుంది. ఏదో అనుకుంటే ఎలాగో అయిందే అని కుమిలిపోతాడు రెడ్డి. దానికి రెండింతలు నలిగిపోతాడు రావు గోపాలరావు. వీరిద్దర్నీ సముదాయించడంలో తన స్వవిషయాన్నే మర్చిపోతుంది శారద. ఇంతకీ ఈ ఘట్టం ఎందులో అనుకున్నారు? శ్రీ లక్ష్మీ ప్రొడక్షన్స్‌వారి "దేవుడు చేసిన పెళ్లి" చిత్రంలో. ఈ చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు. ఏ. పూర్ణచంద్రరావు నిర్మాత. శోభన్ నాయకుడైన ఈ చిత్రంలో నాగభూషణం, లక్ష్మి, కాకరాల, చంద్రమోహన్, గిరిబాబు, కె. విజయ, శారద ముఖ్య పాత్రధారులు. లక్ష్మి ఫిలింస్ విడుదల.



# భానుమతితో ఇంటర్వ్యూ

పద్మశ్రీ భానుమతికి ప్రజల్లో ప్రత్యేకమైన గౌరవం, పరిశ్రమలో ఓ ప్రముఖ స్థానం ఉందనే నిజాన్ని ఎవ్వరూ కాదనలేరు. ఆవిడ ఆ గౌరవాన్ని, ఆ స్థానాన్ని ఎప్పటికప్పుడు కాపాడుకుంటూ వస్తున్నదనే సత్యాన్ని ఎవ్వరూ విమర్శించలేరు. నటిగా నలుగురిచేత సెహభాష్ అనిపించుకుంది. నిర్మాతగా నివాళులందుకొని నిలబడగలిగింది. దర్శకురాలిగా దక్షతను చూపెట్టింది గాయకురాలిగా మధుర గీతాలు పాడి సుమధుర గాయని అనే బిరుదాన్ని సంపాదించింది ప్రతి విషయంలోను, ప్రతి వేషంలోను ప్రత్యేకతను చూపించడమే భానుమతి ప్రత్యేకత తనకు, తన భర్త రామకృష్ణారావుకు ఫలానా పని చేయడం సబబుగా వుంటుంది, సంతృప్తి నిస్తుంది అనిపిస్తే చాలు, ఆ పనిని ఎందరు విఘ్నంచేయ తలపెట్టినా, విమర్శించడం మొదలెట్టినా, ముందడుగు వేయడమే ఆవిడకు అలవాటు అట్టి బహుముఖ ప్రజ్ఞావంతురాలైన ఆవిడతో జరిపిన భేటీని ఈ క్రింద వ్రాస్తున్నాను

ప్ర నేటి చిత్రాలపై మీ వ్యాఖ్య ?

జ నేటి చిత్రాలు రేసు గుర్రాలు వాటి వాటి బలాన్నిబట్టే గెలుపు, ఓటమిలు ఉంటాయి

ప్ర ప్రజలు ఎలాంటి కథలను మెచ్చగలరో అనుభవజ్ఞురాలయిన మీరు చెప్పగలరా ?

జ ప్రస్తుతం ప్రజల అభిరుచి నా అనుభవం కన్నా గూడా మించివుంది కనుక ఎలాంటిచిత్రాలు తీయాలని వార్ని అడిగి తీయడమేమంచిదేమో

' రామయ్యతండ్రి"లో జయంతి

ప్ర కలర్ చిత్రాలవల్ల లాభమేదైనా ఉందంటారా ?

జ లాభం మాట అటుంచి, ప్రేక్షకుడు యిచ్చే డబ్బు వేస్టుగాదు కాస్తేపు కనులవిందైన కలర్‌ను చూడొచ్చు

ప్ర మీరు ఎక్కువ చిత్రాల్లో నటించకపోవడానికి కారణం ?

జ ఇంకా పరిశ్రమలో నాకున్న స్థానాన్ని నిలబెట్టుకోవాలని, ప్రజల్లో నాకున్న గౌరవానికి భంగం వాటిల్లకుండా చూచుకోవాలనే ఆశతోనే తక్కువ చిత్రాల్లో నటిస్తున్నాను

ప్ర ఏ ఎన్ ఆర్, ఎన్టీఆర్‌గార్ల స్థానాన్ని భర్తీ చెయ్యగల నటులు వస్తారా ?

జ ఒకరి స్థానాన్ని ఇంకొకరు నిలబెడతారు అనే విషయంపై నాకు నమ్మకం లేదు వాళ్ల స్థాయిని అందుకోవడానికి ప్రయత్నించే నటులు వుండొచ్చు

ప్ర సెన్సారు విధానంపై మీ అభిప్రాయం?

జ సెన్సు + ఆరు = సెన్సారు అంటే ఆరు సెన్సులు వాటిలో అయిదు సెన్సులు వదలి, ఆరో సెన్సు ఎక్కువ సెన్సారు వారికి

ప్ర మీరు నిర్మించిన చిత్రాల్లో మీకు బాగా నచ్చిన చిత్రం ?

# మన చుట్టూరా బొమ్మల కొలువు

—కృష్ణప్రియ

దసరా వస్తుందంటే గుండెల్లో గుబులు, అందరూ బొమ్మల మన్ను దులుపుతూంటే నేను పెన్నుకి, దుమ్ము దులుపుకోవటం అలవాటు ఈ హస్తినా పురంలో వ్యాపారరీత్యా కొట్టు కొచ్చేక పెన్నులో ఇంకూ పొయ్యలేదు దుమ్మూ దులపలేదు

అలా ఓ తెల్ల కాగితం మీద పెన్నాన్చబోవు సమయాన ''మేమ్ సాబ్ హై ?'' అన్న మాటలు క్రింది మా వర్క్‌షాపు నుంచి వినిపించివి నా గుండెల్లో రాయిపడింది వచ్చే రెవరో 'ఎక్స్‌పర్ట్సు'

ఉసూరు మంటూ వారిని సగౌరవంగా పైకి రప్పించేను — ''కథ మామూలే వచ్చి నా త ని తాలూకు, ఆస్ట్రేలియన్ పార్టీ తరుపున డిజైనరు అశోకా హోటల్లో విడిది చేసిందట — ఆమె గీసి పంపించిన స్కెచ్ చూసి సిల్కులోనూ, క్రేపు లోనూ డ్రస్సులు డిజైన్ చెయ్యాలి ఒకే ఒక్క రోజు టయిములో కొత్త ప్రయోగాలు చెయ్యాలి అలా చెయ్యటం వృత్తి ధర్మమూ, అలవాటూలే కాక డబ్బు విషయంలో — లాభదాయకమే ''

'వ్యాపారస్థుడ్ని పంపించి — నా ముందున్న డిజైన్ పేపర్లని కోపంగా చూసేను ఏమాశ్చర్యం?'

''ఒక పేపర్లో శకుంతల ఎంచక్కా నవ్వు తూంది మరో పేపరు సతీ సావిత్రి, మరో పేపరు ద్రౌపది, (సైరంధ్రి వేషం) నా కోపం ఎగిరిపోయిందిప్పుడు ''

ఆ డిజైన్ గీసి పంపినవారొక ఆస్ట్రేలియన్ స్త్రీ హిందూ పురాణ వనితల బొమ్మ లెంత చక్కగా గీసింది ?

''వీటిని రూపొందించేక, ఇండియన్ మోడల్ అమ్మాయిలను వాటిని ధరింపచేసేక ఎలావుంటుందో చూసేందుకు ?''

కటింగ్ మాష్టర్ని పిల్చి వర్కు కంప్లీటు చేసేటప్పటికి ఐదుగంటలయి పోయింది ఫేక్టరీలో వర్కర్లు దగ్గర కూర్చుని అవసరమైన సలహాలిచ్చి పైకి వచ్చి ఆలోచిస్తూ పడుకున్నాను నా ఎదు రుగా నేను డిజైన్ చేసిన ఎక్స్‌పర్ట్స్ కోలిటీ డిజైన్లున్నవి చప్పున లేచి రేపటి మధ్యాహ్నం అశోకా హోటల్లో ఆస్ట్రేలియన్ డిజైనర్ని కలుసు కునేప్పుడు ధరించబోవు వేషాన్ని ఎంచుకున్నాను

'విక్టోరియా మహారాణిగారు ధరించిన పెద్ద గౌనంటే నాకు చాలా యిష్టం !' దీని యిప్పటి పేరు మేక్సీ !

మర్నాటి గురించి కలలుకంటూ నిద్రపోయేను

అశోకా హోటలుకి వెళ్లేటప్పటి నా సరం జామాని ఒక గంట ముందుగానే సర్దుకున్నాను ఒక 'జోలినిండా' పరికరాలు అవసరమైన మార్పులు గుర్తించేందుకు కటింగ్ మాష్టరూ నాకు సహాయానికి ఒకమ్మాయి

నాకంటే ముందే చేరుకున్న ఎక్స్‌పర్ట్సు గారు చిరునవ్వుతో ఎదుర్కోలుసల్పి తీసుకెళ్లారు ఆస్ట్రేలియన్ డిజైనరు గది ముందు ఎదురయింది పరిచయానంతరము ఒకరినొకరు అత్యంత పరిశీల నగా చూసుకుని మనసారా నవ్వేసుకున్నాం.

'ఆమె కాళ్లకి చెక్క చెప్పులు (పాంకోళ్లూ) నార చీరను తలపించు చీరలాంటి లంగా, ఆపైన, రుద్రాక్ష పూసలతో బొత్తాము లమర్చబడిన బ్లవుజు 'ఇది కేరళలో తయారయే క్రేపు' జుత్తుముడిలో రుద్రాక్షమాల లూజుగా మెలితిరిగి వుంది రుద్రాక్షల మయంగా వున్న ఆవిడ, శ్వేత సుందరి సావిత్రో — సీతోగాని కేలండర్లలో కని పిస్తూండే రూపకల్పనలో వుంది ఆ విడే దో ఆస్ట్రేలియన్ డిజైనరు నా కళలో ఎక్కడ ఎక్కువ తప్పులు పట్టుకుంటుందో నన్న భయం — బెరుకు తగ్గి లోపలికి వెళ్లాను ' మా ముందు కర్టెను వెనుక — అమ్మాయిలు నేనిచ్చిన డ్రస్సులను వేసుకుంటున్నారు

డ్రింక్సు తాగే సమయంలో తెర తొలిగించు కుని వచ్చిందొక సుందరి నా కళ్లు వెడల్పయాయి గది నలుమూలలా చూసేను ''దుష్యంతుడెక్కడా కనపడడు శకుంతల మాత్రం మా యిద్దరి ముందూ నిల్చుంది '' అప్రయత్నంగా ఆమెను పరిశీ లించేను చక్కని అంగ ప్రదర్శన గల అతివ 'హల్టు' రనబడు బట్టని వక్షాన్ని బిగువుగా ముడి వేసుకుని వయ్యారంగా నిలబడింది లుంగీయో — లంగాయో — అర్థంకాని 'రేపరవుండు స్కర్టు' ఆమె నడుముచుట్టూ బిగువుగా — చాలా ఆకర్ష ణీయంగా వుంది నన్నే గమనిస్తున్న — ఆ పిల్ల కొంచెం సిగ్గుగా నవ్వింది

అలా నేను చేసిన ఐదు నమూనాలలోనూ మూడింటిని మెచ్చుకుని, ఒక్కొక్కదానికి పదేసి వేలు, పదిహేనువేలూ ఆర్డర్సు రాసిచ్చేసేడు ఆస్ట్రేలియన్ బయ్యరు కం ఇంపోర్టరు. అనంతరం డైనింగ్ హాల్లోకొచ్చి లంచ్ ముగించుకునేటప్పుడు నా చుట్టూ వున్న ప్రపంచాన్ని విస్మయంతో చూసేను.



శకుంతలలూ, సావిత్రులూ, సీతలూ, దమ యంతీ, పూసలోళ్ల బుల్లెమ్మా— ఎరకలోళ్ల సోది చెప్పేది వీళ్లందరూ, కత్తులూ — ఫోర్కులూ, సహాయంతో భోజనం చేస్తున్నారు నేను మాత్రం తింటున్నట్లు నటిస్తూ, వీళ్లందర్ని చూస్తున్నాను చీరలకు బదులు ఇతర డ్రస్సులు వాడినా, కల్చరు సొసైటీల్లో తిరిగినా నేను మాత్రం మారలేదు చిన్నప్పటి — నా బొమ్మల కొలువుల్లో విప్పారిన కళ్లతో వింతగా ఎలా చూసేదాన్నో — ఈనాడూ నాచుట్టూ మారే ప్రపంచాన్ని అలాగే చూస్తు న్నాను ●

బహూకరిస్తాం. మీరు కాదనకూడదు"

కొంచెంసేపు ఆలోచించి అప్పాగారు సమాధానం చెప్పేరు "సరే! ఒకలా చేదాం మీ పెళ్లి పండక్కి మనవాళ్లందరినీ పిలుస్తావుకదా! ఈ పతకం బహూకరణ కూడా అందులోనే చెయ్యి పతకమే యిస్తావో కనకాభిషేకం చేస్తావో — నువ్వేం చేసినా నా కంగీకారమే—ఏమంటావు?"

ఇది అప్పాగారి అలవాటు. తనకి యిష్టంగా కాదని యెదుటివాళ్లకి చెప్పవలసివస్తే — మరో మార్గం సూచిస్తారు. తన ప్రతిపాదన ఆయన అంగీకరించలేదని గ్రహించి, సౌందర్య చిన్నబుచ్చుకుంది.

నిశ్శబ్దం తాండవిస్తోంది. భారమైన వాతావరణం అలుముకుంది. ఆ నిశ్శబ్దాన్ని భరించలేక యింట్లోంచి బయటికి వచ్చి, సిగరెట్టు వెలిగించి, వీధిలో పోయే బళ్లు మనుషులనీ చూస్తూ నిలబడ్డాను.

కొన్ని క్షణాలు గడిచేయి. నా వెనకెవరో వచ్చి నిలబడ్డట్టయింది. తిరిగిచూస్తే అప్పాగారు! సిగరెట్టు పారేశాను. లోపల సౌందర్య ఒక్కతే వుంది. ఆమెకి వినబడకుండా మాలో మాకే వినబడేలా గొంతు తగ్గించి ప్రారంభించేరాయన.

"ఇరుకున పడ్డాను బాబ్జీ. అక్కరలేని బెడద నెత్తిని వేసుకొచ్చిం దమ్మాయి. తన పట్టుదలేగాని, నా పరిస్థితి అర్థం చేసుకోకుండా వుంది. మొన్న వెంకటేశ్వరరావుగారు కనిపించి ప్రకాశం జూబ్లీ

## అభివ్యక్తం

[23 వ పేజీ తరువాయి]

క్లబ్బు తరఫున సన్మానం చేదామనుకుంటున్నామని చెప్పేరు. నీకు తెలుసుకదా, ఇలాటివాటికి నేను తగనని నా అభిప్రాయం. వాళ్ల నెలాగో తప్పించుకుంటే, యివ్వ డమ్మాయి మళ్లీ అదే సమస్య తెచ్చి పెట్టింది. వాళ్లని కాదన్నానని వెంకటేశ్వరరావు గారేమైనా మనసు కష్టపెట్టుకున్నాడా?"

"నో నో నో! అలాటిదేం లేదు. స్పోర్టింగ్ గానే తీసుకున్నారు."

"నీ కెప్పుడు కనిపించే రాయన?"

"నిన్న మధ్యాహ్నం మా యింటి కొచ్చేరు."

"మరీ మహిళా సమాజం — యిదంతా యెప్పుడనుకున్నారు?"

"ఇక్కడి కొచ్చేదాకా నాకూ తెలియదు" దాచకుండా చెప్పేను.

"సన్మానం విషయం వెంకటేశ్వరరావు నిన్నేమైనా కదిపేరా, సౌందర్య వింటుండగా?"

"నన్ను ట్రై చెయ్యమన్నారు. ప్రయత్నిస్తానన్నాను. తనొప్పిస్తానని సౌందర్య లీడ్ తీసుకుంది."

"అదన్నమాట సంగతి! సరే నువ్వు లోపలికి పద!"

నేను వెళ్లి కూచున్న కొంచెంసేపట్లో అప్పాగారు లోపలి కొచ్చేరు. సౌందర్య పరాజయం పొందిన షాక్ నుంచి తేరుకోలేదింకా!

"చూడు చిట్టితల్లీ!"

సౌందర్య అప్పాగారివేపు చూసింది, కాని మాటాడలేదు. ఆయన చెప్పసాగేరు.

"వ్యవహారాలు మీద వేసుకొచ్చేటప్పుడు అలా బిగించుకు కూర్చోకూడదు. అన్నీ మనం అనుకున్నట్టే జరగవు. మన అభిప్రాయాల విషయంలో పట్టూ విడుపూ వుండాలి. ఎదుటివాళ్ల అభిప్రాయాలకి కూడా విలువ యివ్వాలి. నీతో పంతం పట్టుకు కూచోడం నాకెలా అవుతుంది? అంచేత ఒప్పుకుంటున్నాను" అని కొంచెం ఆగేరాయన.

సౌందర్య కళ్లలో విజయగర్వం, సంబరం!

"ఆఁ అదీ! ఇప్పుడు నిజంగా చిట్టితల్లిలా వున్నావు. నీ కోసం — నా కిష్టం లేకపోయినా — ఈ ఒక్కసారికి మాత్రం నే నొప్పుకుంటున్నాను. కాని నువ్వు నీ ప్రోగ్రాం మార్చుకోవాలి. మరేం లేదు, ఈ మహిళా సమాజం, ప్రారంభోత్సవం యింకా పై వాళ్లెవరితోనూ అనలేదుగా?"

"ఎంత చనువుంటే మాత్రం మీ కన్సెంట్ లేకుండా ఎలా అంటాను మావయ్యగారూ!"

"అయితే సమాజం సంగతలా వుంచ నీ క్కావలసింది నా సన్మానమే కదా? క్లబ్బువాళ్లు చేస్తున్నారు బాబ్జీ! వెంకటేశ్వరరావుగారికి చెప్పు, నే నొప్పుకున్నాననీ — మొదట కాదన్నందుకు మరోలా అనుకోవద్దనీ! చిట్టితల్లి రాజకీయాల్లోకి అడుగు పెడితే, మనకి ఆట కట్టే"

# వారఫలం — మహేష్

1—11—1974 శుక్రవారం మొదలు
7—11—1974 గురువారం వరకు

**మేషం :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృషభం :—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. రావలసిన డబ్బు అందగలదు. కోర్టు వ్యవహారాలు బాగుంటాయి. సజ్జనసాంగత్యం లభించగలదు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అలంకారవస్తువులు కొంటారు.

**మిధునం :—** వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కర్కాటకం :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో శ్రమ కలుగు తుంది. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వినోద కాలాక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం :—** మీ కంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసివస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. వారం ఆఖరులో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. బంధువులకు చికాకులు యేర్పడతాయి.

**కన్య :—** మీ కార్యక్రమాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. మీ ఆలోచనలు ఫలిస్తాయి. స్త్రీలకు —విలాస వస్తువులు కొంటారు. దైవకార్యాలు నేరవేరతాయి.

**తుల :—** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ఉద్యోగంలో శ్రమ కలుగు తుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు. ప్రయాణాలు ఫలిస్తాయి. స్త్రీలకు —ఆరోగ్యం బాగుండదు. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**వృశ్చికం :—** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. సాహసిక వ్యవహా




# ఆంధ్రసచిత్రవార పత్రిక

## ANDHRA SACHITRA VARA PATRIKA

### ADVERTISEMENT TARIFF

[ Effective from 1—1—74 ]

SURCHARGE 20% EXTRA
ON ALL RATES OF ADVERTISEMENT

**Casual :** (Upto 249 Col. Cm.)
Rs. 6.60 per col. cm.

**Contract :** (250 Col. Cm. & above in one year)
Rs. 4.95 per col. cm.

Minimum size accepted : 5cm. x 1 col.

**Advertisements in Colour :**
30% extra per colour

**Special positions :** Opening page 15% extra
**Specified positions :** 10% extra

| **Cover Pages :** | Casual | Contract (6 insertions or over in one year) |
|---|---|---|
| Back Cover Page | | |
| In Multi colours | Rs. 1350.00 | Rs. 1000.00 |

(Effective with the issue dated 10—1—1975)

| 2nd and 3rd covers | | |
|---|---|---|
| Single colour | Rs. 528.00 | Rs. 440.00 |

Rates for other special positions on request.

### TECHNICAL DATA

| | |
|---|---|
| Overall size : | 27 Cm. x 20 Cm. |
| Print area : | 23 Cm x 16.7 Cm. |
| Column Height : | 23 Cm. |
| Column Width : | 5.5 Cm. or 13 ems. |

3 Columns to a page
Screen for half-tone : 65
Mats and Stereos accepted
Last date for receipt of materials :
For inside pages 35 days and for cover Pages 30 days before the date of publication
Day of publication Friday

# సత్పథం. సంసారి — లౌకికవ్యామోహం. బులుసు వెంకటరమణయ్య

సంసారిగా ఉండినా, లౌకికవ్యామోహంలో పడకుండా ఉండడం సాధ్యమవుతుందా? కాదా? అనే విషయంలో ఒకప్పుడు శ్రీరామకృష్ణ పరమహంసకు ఒక నవీన విద్యావేత్తకూ చర్చ జరిగింది. ప్రయత్నించినట్లయితే గృహస్థాశ్రమంలో ఉన్నా, వ్యామోహానికి లొంగకుండా ఉండడం సాధ్యమే అని విద్యావేత్త అభిప్రాయం.

పరమహంస ఈ విధంగా అన్నారు—

"ఒక గృహస్థు లౌకిక విషయాలతో ఏమీ సంబంధం లేకుండా ప్రవర్తించేవాడు. గృహ నిర్వహణ బాధ్యతను ఆయన భార్యయే వహించేది. అతడు డబ్బును ముట్టుకునే వాడు కాడు.

'ఒకప్పుడు ఒక యాచకుడు అతని యింటికి వచ్చి ఏమయినా ఇమ్మని ప్రార్థించాడు. 'అయ్యా! నేను డబ్బును ముట్టుకోను కూడా. నీకు నేనేమీ ఇవ్వలేను' అన్నాడు. అయినా, యాచకుడు అక్కడనుంచి కదలకుండా పదే పదే అడిగాడు. గృహస్థునికి విసుగు కలిగింది. "అయితే రేపు రా. ఏమయినా ఇప్పిస్తాను" అని పంపివేశాడు.

మర్నాడు ఆ యాచకుడు ప్రత్యక్షమయ్యాడు. గృహ యజమాని యింటిలోకి పోయి భార్యను పిలిచి "పాపం! దరిద్రుడైన యాచకుడు ఒకడు వచ్చాడు. ఒక రూపాయి ఇచ్చి పంపివెయ్యి" అన్నాడు ఆమె మండిపడి "రూపాయా! బాగుంది. చెట్టు దులిపితే రూపాయలు రాలుతున్నాయి కదూ! ఏమీ ఇవ్వడానికి వీలులేదు" అన్నది. "నిన్న వస్తే, నేడు రమ్మని చెప్పాను. ఏమయినా ఇస్తేనే మంచిది' అన్నాడు భర్త. "అంతగా ఇవ్వాలనుంటే రెండణాలు అతని మొగంమీద పారేస్తాను. కాని అంతకుమించి ఇవ్వను" అంది ఆమె.



యజమాని ఏమీ అనలేకపోయాడు.

యాచకుడికి రెండణాలు మాత్రమే ముట్టాయి

సంసారి తన మనస్సు లౌకిక విషయాలను అంటిపెట్టుకుని, అపరిశుద్ధంగా ఉన్నదని తృప్తిపడవచ్చు. కాని అతడు భార్యకు లొంగి ఉండడం సహజం. అట్టి స్థితిలో అతడు లౌకికవిషయాలకున్నూ లొంగినవాడే కాగలడు. అతని హృదయం పరిశుద్ధమైనదని భావించడం సరికాదు."

ఈ మాటలు విన్న ఆ విద్యావేత్త మౌనం వహించవలసి వచ్చింది.

---

## వారఫలం

రాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసమైన వ్యయం చేస్తారు.







ధనుస్సు :— మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

మకరం :—వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. దైవకార్యాలు నెరవేరతాయి. ప్రయోజనంగల సంభాషణలు జరుపగలరు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

కుంభం :— మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో వృత్తిలో పోటీవారిపోటీ పెరుగుతుంది. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

మీనం :— వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు —సంతోషకరమైన వార్తలను వింటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

# మాధురి

టి. నాగకుమారి




నీలాంబరంలో మిణుకు మిణుకుమంటున్న నక్షత్రాలు గాఢాంధకారంలోని దివ్యజ్యోతుల్లా వింత కాంతిని ప్రసాదిస్తున్నాయి. సుధాకరుడు మబ్బుల చాటున కనిపించి కనిపించకుండా దోబూచులాడుతున్నాడు.

సన్నజాజి పందిరి క్రింద కూర్చుని గగన సీమలోని వింత సొయగాల్ని తిలకిస్తున్న మాధురి మనస్సులోని మధుర భావాలు ఆకాశంలోని నక్షత్రా క్షణక్షణానికి కవితా కాంతులీనుతున్నాయి. "మధూ! మధూ! ఇక్కడ ఒంటరిగా కూర్చుని ఏం చేస్తున్నావమ్మా." అన్నయ్య పిలుపుతో ఈ లోకానికివచ్చింది మాధురి.

"ప్రశాంతమైన మనస్సు ఏకాంతాన్ని కోరుతుంటే ఇక్కడికి వచ్చి కూర్చున్నానన్నయ్యా" సమాధానమిచ్చింది మాధురి లేచి నించుంటూ.

"చూడు మధూ! ఇతను నా బాల్య మిత్రుడు, ప్రియ మిత్రుడు రవీంద్ర. ప్రొఫెసర్. పల్లెటూరి వాతావరణంలోని ప్రశాంతిని చవిచూడాలనే కుతూహలంతో ఒక సంవత్సరం పాటు సెలవు పెట్టి ఇక్కడికి వచ్చాడమ్మా. అన్నట్టు రవీంద్ర చిత్రకళాకారుడు. వీనుల విందుగా పాడగలడు కూడా."

"సతీష్! చెప్పిన వివరాలు చాలుగాని, వాక్ప్రవాహాన్ని ఆపి మీ చెల్లెల్ని కాస్త పరిచయంచేస్తావా లేదా!" చిరుకోపాన్ని ప్రదర్శిస్తూ అన్నాడు రవీంద్ర.

"కాస్త ఏం ఖర్మ! పూర్తిగానే పరిచయం చేస్తాను. ఈమె నా చెల్లెలు. పేరు మాధురీలత. కవితాప్రియ. ఈ వూరికి వో గొప్ప డాక్టర్. చాలా? వివరాలు".

నమస్కార ప్రతినమస్కారాలయ్యాక కాస్సేపక్కడే కూర్చుని వెళ్తానంటూ లేచాడు రవీంద్ర.

"అప్పుడే వెళ్తానంటావేమిట్రా! భోజనం చేసి మరీ వెళ్ళు. భోజనానికి అన్ని ఏర్పాట్లు చేయమనిచెప్పి వచ్చాను కూడా. తర్వాత ఇంకో విషయం. రేపే మనింట్లో ఒక గది ఖాళీ చేయిస్తాను. వచ్చి ఇక్కడే వుండు." గుక్క తిప్పుకోకుండా చెప్పేశాడు సతీష్.

మిత్రులు విడిపోయారు.

* * *

తనకని ఏర్పాటు చేసిన గదిలో కూర్చుని నలుదెసలా పరికించి చూడసాగాడు రవీంద్ర. అందమైన సోఫాసెట్ ఫర్నిచర్ అన్ని అమర్చబడి వున్నాయి. "కాఫీ తీసుకోండి" అన్న మాధురి పిలుపుతో ఈ లోకానికి వచ్చాడు రవీంద్ర.

"ఏరా రవీంద్రా! ఎలా ఉంది గది. నీకు నచ్చిందా" అంటూ అప్పుడే అక్కడికి వచ్చాడు సతీష్.

"గదికేం బ్రహ్మాండంగా ఉంది. థాంక్స్" అన్నాడు రవీంద్ర నవ్వుతూ.

"మరేమిటనుకున్నావు. మా మాధూ అమరికలోని గొప్పతనం అది" మాధురి వైపు మెచ్చుకోలుగా చూస్తూ అన్నాడు సతీష్.

"అయితే ఇదంతా మాధురిగారి ప్రతిభా విశేషమన్నమాట." అన్నాడు రవీంద్ర ప్రశంసా

విశ్రాంతి పొందండి!
చార్మినార్ త్రాగండి.




అచ్చమైన
మేలిరకం పొగాకుల
పరిమళము కమ్మదనం
అనుభవించండి.

62*
పైసలకు
10

వి ఎస్ టి తయారీ
భారత దేశపు అత్యధికంగా అమ్ముడుపోయే సిగరెట్!

CMVS-123,234 R TL

* సిఫారసు చేయబడిన అధికతమ చిల్లర ధర (స్థానిక పన్నుల అనుసారం)

## మాధురి

పూర్వకంగా మాధురి వైపు చూస్తూ.

"అన్నట్లు ఒక్క విషయం చెప్పటం మరిచాను సతీష్! నాకోసం భోజనం ఏర్పాటు ఏమీ చేయ వద్దు. వంటమనిషి మణి ఉన్నాడు. క్రింద ఒక షెడ్డు ఇచ్చావంటే మిగతా ఏర్పాట్లన్నీ వాడే చూసుకోగలడు." అన్నాడు రవీంద్ర నింపాదిగా.

"సరే రవీ! అదంతా నీ ఇష్టం. ఇక్కడ నీ ఇష్టం వచ్చినట్లు ఉండవచ్చు. కాదనే వారెవరు లేర్రు. మొహమాట పడక్కర్లేదు. సరేనా." నవ్వుతూ అన్నాడు సతీష్‌బాబు.

* * *

మధురమైన వీణానాదం వీనుల విందుగా వినవస్తుంది. చదువుతున్న పుస్తకం ప్రక్కన పెట్టి కిటికీలోంచి సాలోచనగా తోటవైపు చూశాడు రవీంద్ర. చుట్టూరా తెల్లటి గులాబులు పరిమళాలు వెదజల్లుతున్నాయి. మధ్యగా ఉన్న పాలరాతి తిన్నె మీద కూర్చుని వీణాగానంలో మైమరచి వీణె కన్యలా మెరిసిపోతుంది మాధురి. గాన మాధుర్యాన్ని ఆపి నెమ్మదిగా కనులు తెరచిన మాధురికి ఎదురుగా ప్రశాంత వదనంతో రవీంద్ర కనిపించాడు. "అరె మీరెప్పుడు వచ్చారు." ఆశ్చర్యంగా ప్రశ్నించింది మాధురి.

"మీ మధుర మంజుల గానం వీనులను సోకిన తక్షణమే వచ్చేశాను." అన్నాడు రవీంద్ర తన్మయత్వంగా.

"నా గానం మిమ్మల్నింతగా పరవశింపజేసిందా." అడిగింది మాధురి నవ్వుతూ.

"నిజం మాధురిగారు! ఇలా మీ గానం వింటుంటే కాలం తెలియకుండా హాయిగా గడిచిపోగలదు"

"నా సంగతి సరేకాని మీరు గీసిన బొమ్మలు ఇంతవరకు ఒక్కటి కూడా చూపించలేదేం?" ప్రశ్నార్థకంగా రవీంద్ర కళ్లల్లోకి చూస్తూ అడిగింది మాధురి.

"ప్రస్తుతం ఏమీ గీయలేదుగా. గీస్తే మీకు చూపించకుండానా?" అన్నాడు రవీంద్ర చిరునవ్వుతో.

* * *

"రవీంద్రా! ఈమె ఎవరో నీకు తెలుసా!" అప్పుడే హాల్లోకి ప్రవేశిస్తున్న రవీంద్ర నుద్దేశించి అన్నాడు సతీష్ అపర్ణను చూపిస్తూ.

పరిశీలనగా చూశాడు రవీంద్ర. వదులుగా అల్లిన జడలోనుంచి పసుపు పచ్చ కనకాంబరాలు నిండుగా నవ్వుతున్నట్లున్నాయి. పసుపు పచ్చటి ఫుల్ వాయిల్ చీర, అదే రంగు జాకెట్ ధరించి పసిమిఛ్ఛాయతో, ప్రశాంత వదనంలో సన్నని చిరునవ్వు జల్లులు కురిపిస్తున్న ఆమె వర్ణించనలవి కాని మధుర గంభీర మూర్తిలా భాసించింది రవీంద్రకు.

"నా కెక్కడో చూసినట్లు గుర్తుకు రావటం లేదు సతీష్!" సాలోచనగా అన్నాడు రవీంద్ర.

"అదేనోయ్ నీ గొప్పతనం. ఊహించుకో చూద్దాం మరి." అన్నాడు సతీష్ చలోక్తిగా.

"నేనేమీ వూహాలోకాల్లో విహరించే కవిని కాదు ప్రియ మిత్రమా! నువ్వు త్వరగా చెప్పావా! నన్ను వెళ్ళమంటావా!" అన్నాడు రవీంద్ర చిరుకోపం నటిస్తూ.

"అంత విసుగైతే ఎలా రవీ! అయితే చెప్తాను. ఈమె మదీయ భార్యామణి. అపర్ణాదేవి. ప్రస్తుతం పుట్టింటినుంచి వేంచేశారు!! అన్నాడు సతీష్ గర్వంగా

"నమస్తే" అపర్ణవంక నిశితంగా చూస్తూ చేతులు జోడించాడు రవీంద్ర.

'నమస్తే' ప్రతి నమస్కారం చేసింది అపర్ణ.

"అక్కయ్యను పరిచయం చెయ్యటానికి ఇంత మురిసెమా? సతీష్" అన్నాడు రవీంద్ర నవ్వుతూ.

"మీ అక్కయ్య మరి ఆదర్శ సతీమణి కదుటోయ్! అందుకే ఆ ప్రత్యేకత" అపర్ణ ముఖంలోకి కొంటెగా చూస్తూ అన్నాడు సతీష్.

* * *

"హల్లో రాధీ ! బహు కాల దర్శనం" మంద హాసం చేస్తూ అంది మాధురి.

"అన్నయ్య దగ్గర్నుంచి ఈ రోజే వచ్చాను. ఎక్కడ ఉన్నా నీ పుట్టిన రోజుకి మాత్రం హాజర్ కావల్సిందేగా." అంది రాధిక నవ్వుతూ.

'నా పుట్టిన రోజు సంగతి నాకు గుర్తే లేదు. అయినా ఏమి ఇవ్వలేని ఈ స్నేహితురాలి మీద నీకెందుకింత శ్రద్ధ చెప్పు రాధీ !"

"మధూ! స్నేహం ప్రతిఫలాన్ని కాంక్షించదు. అపురూపమైన స్నేహ మాధుర్యాన్ని నాకందించావు. నే కోరవలసింది లేదు.

"అలా తోటలోకి వెళ్లి కూర్చుందాం పద. చాలా రోజులయింది నీ వీణా గానం విని"

"ఇప్పుడు వీణ వాయించే వోపిక మాత్రం లేదు రాధీ ! ఏవన్నా కబుర్లు చెప్పు వింటాను."

"నందనవనం లాంటి మన తోట చూసి చాలా రోజులయింది. అక్కడే కూర్చుని కబుర్లు చెప్పుకుందాం. పద మధూ!"

ఆకు పచ్చ తివాసీలా పరిచి ఉన్న పచ్చిక మీద కూర్చుని ప్రకృతి రసాస్వాదనలో లీనమై పోయారిరువురు.

* * *

"రవీంద్రా! రేపు మాధురి పుట్టిన రోజు" అన్నాడు సతీష్ హుషారుగా.

"అలాగా ! మాధురి నాతో ఈ విషయం చెప్ప లేదేం మరి"

"వ ధ అసలు నీతో మాట్లాడటమే ఒక గొప్పవరం. ఇంక మాధురి ఇలాంటి విషయాలన్ని పట్టించుకుంటే నాకీ బాధెందుకు రవీంద్రా."

"అయితే ఒక్క మాటడుగుతాను చెప్తావా సతీష్! మాధురి ఎప్పుడు అలా నిర్లిప్తంగా, ఏమీ పట్టనట్లే ఉంటుంది. ఎందుచేత! కారణం తెలుసు కోవచ్చా!"

"మాధురి గురించిన అన్ని విషయాలు త్వరలో చెప్తాను రవీంద్రా! వీలు చూసుకుని" అంటూ హడావుడిగా అక్కడినుంచి వెళ్లి పోయాడు సతీష్.

* * *

"ఏమిటి సతీష్! పుట్టిన రోజు పండుగ ఉత్సాహమే ఎక్కడా కన్పించం లేదు" అన్నాడు రవీంద్ర మేడ మెట్లు దిగుతూ.

"మా మాధురికి ఆడంబరాలంటే అసలు ఇష్టం ఉండదు. ఈ పుట్టిన రోజు పండుగ చేసుకోవటం కూడా మా కోరిక కాదనలేక మాత్రమే. చాలా సామాన్యంగా జరగాలని ముందే షరతు పెట్టింది."

"కంగ్రాచ్యులేషన్స్! మాధురిగారూ! మీపుట్టిన రోజు సందర్భంగా ఈ చిన్న కానుక నా బహుమతి." చేతిలోని బొమ్మను అందించాడు చిరునవ్వుతో రవీంద్ర.

"థాంక్యూ" అని రవీంద్ర చిత్ర కళాఖండాన్ని అందుకుంటూ తన కృతజ్ఞత తెల్పుకుంది మాధురి.

అన్నయ్య హాస్యోక్తులతో, రాధిక రవీంద్రల తోటి సంభాషణలతో ఆనందంగా గడిచి పోయింది. మాధురి పుట్టినరోజు.

కాలప్రవాహంలో నెల రోజులిట్టే గడిచి పోయాయి. ఉదయం సేవాసదన్ కార్యకలాపాలతో, సాయంసమయాన రాధిక రవీంద్రలతో సమావేశమై ఏదో ఒక విషయంపై చర్చలు జరపటం, వీటి తోనే మాధురికి క్షణం తీరటం లేదు.

* * * *

"ఏమిటి మాధురీ! తీరిగ్గా కూర్చుని పరిశీలి స్తున్నావు"

"మీరు గీసిన అందాలు చిందే అపరంజి బొమ్మని" నింగా పరిశీలిస్తూ అంది మాధురి.

"అయితే మేము విమర్శలకు గురి కాబోతున్నా మన్న మాట." అన్నాడు రవీంద్ర భయం నటిస్తూ.

"బాగా కనిపెట్టేశారు. ప్రస్తుతం ఆ పనే చెయ్యబోతున్నాం."

"అయితే ఇంకఆలస్యం దేనికి? ప్రారంభించండి."

"చూడండి రవీంద్రా! నా విమర్శలకు మీరు బాధ పడనంటే మాత్రమే వివరిస్తాను."

"కళను నిశితంగా పరిశీలించి వాటిలోని లోపా లను క్షుణ్ణంగా, సుహృద్భావంతో వివరిస్తానంటే హర్షించని.వారెవరు మాధురి? ముఖ్యంగా నేను మీ విమర్శనలు మాత్రమే కోరుకుంటున్నాను" అన్నాడతను నిశ్చలంగా. . .

"మీరు చిత్రాల్ని గీయటంలో కేవలం అందాల్ని మాత్రమే సృజిస్తారు. కాని ఆ అందంలో కరుణ భావం ఏ మాత్రము ఉట్టి పడటం లేదు. కళ, కళ కోసమే కాదు రవీంద్రా! సర్వజన శ్రేయస్సుకోసం. నా అభిప్రాయం ప్రకారం కళకు అందచందాలతో పాటు జీవన తత్వానికి కూడా ఎక్కువ ప్రాముఖ్య మివ్వాలి రవీంద్రా! నీ చిత్రాలు మారాలి. అందం కంటే ముందు కరుణభావం ఉట్టి పడాలి. అ భాగ్య జీవుల ఆర్తిని లోకమంతా కళ్ళు విప్పుకుచూసేలా నువ్వు చిత్రించాలి. అదెంత స్వల్పమైనా సరే మనిషి మనస్సును తాకాలి. లోలోతుల నిగూఢతను సృజించి మనిషిని ఆలోచింపకలిగేలా చేయాలి. డబ్బు, అందము ఇచ్చేవి. క్షణికమైన ఆకర్షణ మాత్రమే. మనస్సు మానవత ఇచ్చేవి అనంతమైన, అఖండమైన సంతృప్తి. అన్ని సుగుణాలు కలసిన మనుష్యులుంటే అవని అంతా ఆనంద మందిరంగా మారి పోదూ! అన్ని పువ్వులు పరిమళాలతో వికసించాలనీ, అటువంటి పరిమళ భరితమైన నందనవనిగా ఈ అవని తిల కించాలని ఉంది రవీంద్రా! కనీసం ఒక్క గ్రామ మైనా నేననుకున్న "శాంతివనం" కావాలి రవీంద్రా! అందుకే నా ఈ కృషి అంతా, మన సేవల ద్వారా మన కళల ద్వారా కొందరైనా వెలుగులోకి రాగలి గితే మన శ్రమ ఫలించినట్లే" —ప్రశాంతమైన సరోవరం ఒక్కసారిగా విజృంభించినట్లుగాఉన్నాయి మాధురి సంభాషణా తరంగాలు!!

"మాధురీ! ఇంతక్షుణ్ణంగా, నిశితంగా వక్కాటి భావాలను వివరించగల నీవు ఎందుకంత మవునంగా, నిర్లిప్తంగా ఏమి పట్టనట్లె ఉంటావు."

"దానికి కారణాలు రెండున్నాయి రవీంద్రా! ఒకటి మాట్లాడే అవకాశం, అవసరం ఎప్పుడు రాలేదు కనుక. రెండు అనవసరంగా మాట్లాడటం ఇష్టం ఉండదు కనుక.

మొత్తానికి 'స్నేహ మాధురి' అని పించావు.

'అంటే' అర్థం కానట్లు ప్రశ్నించింది మాధురి.

"మనస్సు అనే పందిరికి మధుర భావాల లతలు అల్లుకుంటేవాటికిపూలుపూసి స్నేహమాధుర్యపు పరి మళాలు అంతటా వెదజల్లుతున్నాయట. అందుకే తమరు "స్నేహ మాధురి" అయ్యారు.

"కవిత్వం చాలా బావుంది. చిత్రకళకు తోడు కవిత్వం కూడా ప్రారంభిస్తే ఇంక మీ ప్రతిభ ప్రకాశ వంతంగా శోభిస్తుంది." అన్న ఆమె మాటల కతను "పొగడకు" అంటూ వారించి, చిరునవ్వుతో త్రుంచేశాడు.

* * *

మరోనాడు

"రవీంద్రా! నీతో కొన్ని ముఖ్యమైన విష యాలు మాట్లాడాలి. అలా పొలంవైపు వెళ్దాం వస్తావా'! సన్నని స్వరంతో మంద్రంగా అన్నాడు సతీష్.

'పద' చదువుతున్న పుస్తకాన్ని టేబిల్ పై పెట్టి సతీష్‌ని అనుసరించాడు రవీంద్ర.

"రవీంద్రా! మాధురి గురించి నీ అభిప్రాయ మేమిటి?"

"ఏ విషయంలో"

"పెళ్ళి విషయంలో ?!"

"ఆ విషయం ఆమె అభిప్రాయాన్ని అనుస రించి ఉంటుంది. ఆ విషయంలో నా సలహాఎందుకు కోరుతున్నావో నా కర్థం కావడం లేదు" సందేహా స్పదంగా అన్నాడు రవీంద్ర. సతీష్ కళ్ళల్లోని భావాల్ని గమనిస్తూ.

"మాధురియే నీ జీవన సహచరిగా లభిస్తే నీ అభిప్రాయ మేమిటి?" సూటిగా ప్రశ్నించాడు సతీష్.

"సతీష్! పెళ్ళి విషయం గురించి నాకు కొన్ని అభిప్రాయాలుండేవి. పెళ్ళి చేసుకోమనే అమ్మా నాన్నలపోరుపడలేక విశ్రాంతి, ప్రశాంతి అంటూ ఇక్కడికి వచ్చేశాను. ఇక్కడ మాధురి సహచర్యం లభించాక నా అభిప్రాయాలు ఒక రూపం దిద్దు కొన్నాయి. మాధురియే నా సహచరి అయితేఅంత కంటే సంతోషించదగ్గ విషయం మరొకటి ఉండదు" అన్నాడు రవీంద్ర ఆనందంగా.

"రవీంద్రా! నీవంటి విద్యావంతుడు, సంస్కార వంతుడు బావమరిదిగా లభించటమే నా అదృష్టం అనుకుంటున్నాను. కాని, మన అదృష్ట ఫలితం అంతా మాధురి నిర్ణయం పై ఆధారపడిఉంది. రవీంద్రా!. . . . .మాధురి మనస్సు ఎంత సున్ని తమో అంత కఠినమూ కూడా. మాధురి జన్మిం చటమే ప్రేమైకమూర్తిగా జన్మించిందేమో. వూహ తెలిసినప్పట్నించి ప్రేమ అనే విషయానికి ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇచ్చేది. మాధురికి వయస్సు వచ్చినకొలది ప్రేమ విషయం గురించిన జిజ్ఞాస ఎక్కువ కావటం మొదలు పెట్టింది. మా మేనమామ కొడుకు సుదీప్‌బాబుకి మాధురికి వివాహం చేయా లని మాధురి పుట్టినప్పట్నించి అనుకునేవారు.

ఈ విషయంలో మామయ్యది, నాన్నాగారిది ఎప్పటికి ఏకాభిప్రాయమే. మాధురి యూనివర్సి టిలో ఫస్టుక్లాసు తెచ్చుకుంది. ఓరోజు నాన్నాగారు మాధురిని పెళ్లి విషయమై కదిపారు.



"మాధురీ! సుదీష్ బావపై నీ అభిప్రాయం ఏమిటమ్మా."

"బావను గురించి ఒక అభిప్రాయమంటూ నాకేమీ లేదునాన్నా !"

"పోనిలే ! దీనికి సమాధానం చెప్పు బావను పెళ్లి చేసుకోవటం నీ కిష్టమేనా !" సూటిగా ప్రశ్నించారు నాన్నాగారు.

"నాకిప్పుడే వివాహం చేసుకోవాలని లేదు నాన్నా! ఈ విషయంలోనన్నాట్టే బలవంతం చేయకండి. నేను మెడిసన్ చదువు కుంటాను " అని అక్కడి నుంచి వెళ్లిపోయింది మాధురి

తర్వాత నాన్నగారు మాధురి వివాహ విషయమై ప్రస్తావించలేదు. తను కోరినట్లే మెడిసన్‌లో చేర్పించారు. రాధిక మాధురి క్లాస్‌మేట్ రానురాను ఇద్దరి స్నేహం బలపడి ప్రాణ స్నేహితులయారిరువురు. మాధురి ఈ సమయంలోనే కథలు వ్రాయటం మొదలు పెట్టింది. మాధురి భావాలన్నా కథలన్నా రాధికకు ప్రాణం ప్రతి వేసవిలోను సుదీష్ బాబు మా ఇంటికి వచ్చేవాడు. ఎప్పుడు గొప్పగా ఇంగ్లీషు మాట్లాడే సుదీష్‌ని, "తెలుగురాని మొద్దబ్బాయి ! ఇక్కడెవరికీ ఇంగ్లీషురాదు తెలుగుమాట్లాడటం నేర్చుకోండి." అంటూ మృదువుగా పరిహాసం చేసేది.

ఖరీదైన సిగరెట్ నాజూగ్గా పెదవుల మధ్య ఇరికించుకుని, కళ్లకుగాగుల్స్ అందంగా తగిలించుకుని ఠీవిగా తిరిగే సుదీష్‌ని చూస్తే ఒక్కోసారి మాధురికి నవ్వు వచ్చినా, రానురాను సుదీష్ వేష భాషలు మాధురికి చిరాకు కలిగించేవి. మెడిసన్ చదవటం పూర్తయ్యాక నాన్నగారు మళ్లీ మాధురితో పెళ్లి విషయమై కదిపారు.

"నాన్నా ! నాకు సుదీష్ బావను వివాహం చేసుకోవాలని లేదు " అని మాధురి స్పష్టంగా చెప్పింది.

"పోనీ ! మరేదైనా సంబంధం చూస్తానమ్మా. పెళ్లికి నువ్వు ఇష్టపడితే నాకంతేచాలు "

"నాన్నా ! నా కిప్పుడే వివాహం చేసుకోవాలని లేదు. దయచేసి నా పెళ్లి సంగతి మీరు పూర్తిగా మర్చిపోండి."

"కారణం తెలుసుకోవచ్చా మాధురీ !"

"నా దృష్టిలో వైవాహిక జీవితం చాలా పవిత్రమైనది. జీవితం వైవాహిక దశలోనే వో క్రొత్త మలుపు తిరుగుతుంది. కాని, ఆమలుపులో పూల బాట సృష్టించుకోవాలంటే నన్ను నన్నుగా ప్రేమించే వ్యక్తి కావాలి నాన్నా ! అటువంటి వ్యక్తి కోసం జీవితమంతా నిరీక్షిస్తూ ఉంటాను. ఆ నిరీక్షణలోనే ఆనందంగా జీవిస్తాను.

"తర్వాత మాధురి సేవాసదన్ ప్రారంభించింది. చింది. ఈ పల్లెలోనే ప్రాక్టీసు పెట్టింది. నాన్నగారు పట్టుపట్టడంవల్ల, నాన్నగారి మాట కాదనలేక నేను అపర్ణను వివాహం చేసుకున్నాను మాధురి ఒక నిర్ణయం తీసుకుందంటే అది ఏ సమయం లోను మారదు. నాన్నగారు చివరి క్షణాల వరకు మాధురి వివాహం చూడాలని తహతహ లాడారు. కాని, మాధురి తన నిర్ణయం మార్చుకోలేదు. నాన్నగారు పోయాక మాధురి మరీ నిర్లిప్తంగా తయారయింది. 'శాంతినివాస్' అనే పేరుతో మరొకసేవా సదన్ ప్రారంభించింది మాధురి. దాని నిర్వహణ బాధ్యత పూర్తిగా అపర్ణ తీసుకుంది. రాధిక కూడా మాధురి ప్రోత్సాహంతో ఇక్కడే ప్రాక్టీసు ప్రారంభించింది. అప్పుడప్పుడు హైదరాబాద్ వెళ్లి వస్తూండేది రాధిక వాళ్లన్నయ్య దగ్గరికి.

వో రోజు ఆఫీస్ రూమ్‌లో తనడైరీ మర్చిపోయి వెళ్లింది మాధురి. అప్పుడే అక్కడికి వచ్చిన అపర్ణ తీసిఉంచిన ఆ డైరీ చూడటం తటస్థించింది. అప్రయత్నంగా చేతులు పేజీలు త్రిప్పాయి. వో పేజీ అపర్ణ దృష్టిని మరింత ఆకర్షించింది

వివాహబంధం మధురానుబంధం ఒకరికొకరుగా జీవించే దంపతులిరువురు చివరి క్షణం వరకుమధురమైన స్నేహితులు. తొలినాడు కలిగిన ఆ మధురానుభూతిని చివరి వరకు నిలుపుకునేదంపతులెంత మంది. ఈ నాటి వైవాహిక వ్యవస్థ మాధుర్యాన్ని కోల్పోతూంది. వివాహమైన మరునాటి నుండే ఒకరిపైన ఒకరికి అసహ్యం. చిరాకు. ఇలా దాంపత్య జీవనం తప్పదన్నట్లుగా గడపటం ఎంత ఘోరం.

దంపతులు ఒకరికోసం ఒకరు అన్నట్లుగా జీవించటంలో ఎంతటి తియ్యదనం ఉంది ప్రేమమయులైన వారిరువురి "అనుబంధం" ఎంతటి అపురూపం ! అటువంటి మధురమైన అనుబంధంలోని మాధుర్యం ఈ నాటి దంపతుల మధ్య ఎక్కడా కన్పించదు ఒకరి నుండి ఒకరు ఆశించవలసింది ప్రేమ. కాని, నేటి భర్తలు ఆశిస్తున్నది భార్యదగ్గర నుంచి కట్నాలు, కానుకలు. రాను రాను వైవాహిక వ్యవస్థ ఒక వ్యాపారంగా మారిపోతుంది. వివాహం అయిన నాల్గు రోజులకే దంపతుల మధ్య అనుబంధం విడాకులకు దారి తీస్తుంది. స్వార్థరహితులైన, అనురాగమయులైన, ప్రేమ ప్రపూరితులైనదంపతులు ఈ జగతిలో ఉద్భవించేదెప్పుడో !

ఇలా మాధురి భావలతలు మధురంగా తన డైరీనిండా అల్లింది. అపర్ణ ఇప్పటికిమధురమైన ఆ భావాలు మరువలేదు రాధిక కూడా మాధురి మూలంగా వివాహం చేసుకోలేదు. నీ వివాహం అయ్యాకే నా వివాహం గురించి ఆలోచించేది అనేది రాధిక. అయినా మాధురి తన నిర్ణయం మాత్రం మార్చుకోలేదు కాలప్రవాహంలో ఇలా సాగుతున్న మా జీవితాలలోకే అనుకోకుండా నీవు ప్రవేశించావు. మాధురి నిర్ణయం ఇప్పటికైనా మార్చుకుంటే నా కదే సంతోషం రవీంద్రా ! మాధురి జీవన లత చిగురించే తరుణం రావాలని నా మనస్సు ఉవ్విళ్లూరుతుంది" అన్నాడు సతీష్ చెమర్చిన కళ్లను తుడుచుకుంటూ

* * *

"అన్నయ్యా ! అన్నయ్యా ! నీకో శుభవార్త చెప్పనా !"

"ఏమిటమ్మా ! అంత శుభకరమైన వార్త !" ఆసక్తిగా అన్నాడు సతీష్.

"నేను ఆర్మీ డాక్టరుగా వెళుతున్నానన్నయ్యా ! మొన్న ఈ మధ్యనే అప్లికేషన్ పంపించాను. ఈ రోజే ఆర్డర్స్ వచ్చాయి. రెండు, మూడు రోజుల్లో వెళ్ళి పోవాలి" అంది మాధురి సంతోషంగా.

"ఆపు మధూ ! ఇంక నేను వినలేను. మమ్మల్నిలా దుఃఖపెట్టటమే నీధ్యేయమయితే అలాగే వెళ్ళు మధూ ! వెళ్ళు !" అన్నాడు ఆవేశంగా దుఃఖ పూరిత స్వరంతో

"అన్నయ్యా ! మిమ్మల్ని విడిచి వెళ్ళటం నాకు మాత్రం బాధకాదా ! దేశం అత్యవసర పరిస్థితుల్లో వుంటే ఆ మాత్రం సహాయ పడటం డాక్టరుగా నా విధికదా అన్నయ్యా ! మమతలతో కట్టుబడితే మనమేపనిచెయ్యలేం. ఎంతో మంది జవానులు తమ భార్య బిడ్డలను వదలి ఎందుకు వస్తున్నారు ! ప్రాణాలను సైతం దేశంకోసం ఎందుకర్పిస్తున్నారు ! వాళ్ళకు మాత్రం మమతలు, మమకారాలు ఉండవా! మానవతా దృష్ట్యా నువ్వే ఆలోచించుకో అన్నయ్యా ! ఇంతకంటే నేను చెప్పగలిగేదేమీ లేదు" అంది మాధురి సజల నేత్రాలతో.

"మధూ ! ఈ త్యాగానికి అర్థం."

"ఇది త్యాగమని నేను భావించటం లేదన్నయ్యా ! ఈ చెల్లెలిపై ప్రేమ నీ కలా అన్పిస్తుంది "

"మధూ ! విరిసిన వెన్నెల్లో నీ పాలమనసు వికసించాలని, నీ జీవనలత పచ్చగా కళకళ్ళాడుతుంటే నేను చూడాలని కోరుకోవటం తప్పా మధూ !" కన్నీటిధారలు జాలువారుతుంటే ఆవేదనగా అన్నాడు సతీష్.

## అరవకు !

### —ఎన్. ఆర్. వెంకటేశం

అరవకు ! పిచ్చిగా నోరు
తెరవకు ! !
నిన్ను గమనిస్తూనే ఉన్నా
నిగా వేస్తూనే ఉన్నా
నీ నోటికి మురాతలేదు
నువు చేసిన చేతలేదు
చీకటంటావు
చేతులు ముడుచుకుంటావు
ఆకలంటావు
ఆసనం వేసుకుంటావు
మోసం అంటావు
ముద్దుగా చూస్తూంటావు
నీ అరుపు ఎడారి కేక
నీ ఆశయం సంగీతం రాని బాకా
వడిగా లే
ఒళ్లు విప్పు
కళ్లు విప్పు
నడిదినం రవిలా
నడుం బిగించు
కాలం లా చలించు
జ్వాల వై జ్వలించు
చేతనతో నీ పొత్తు
సృజన నీ సొత్తు

"నా జీవితానికి ఇప్పుడు వచ్చిన లోటు మాత్రం ఏమిటన్నయ్యా!" అంది మాధురి లాలన ఉట్టిపడు తున్న స్వరంతో

"మధూ! జీవితం ఆనందమయం ఆశానిలయం వివాహంతోకాని మనిషికి పరిపూర్ణత్వం రాదమ్మా ఈ నిర్ణయం మార్చుకుని ఇకనైనా వివాహం చేసుకుని మమ్మల్ని సంతోషపెట్టమ్మా"

"మానవ జీవితంలోనే పరిపూర్ణత లేదన్నయ్యా ఇంక వైవాహిక జీవితంతో పరిపూర్ణత ఎక్కడి నుంచి ఏర్పడుతుంది ఆశలతోనే మానవుడు ఎదుగుతాడు తన పిల్లలకి మంచి భవిష్యత్తు కావాలని కోరుకుంటాడు పెళ్ళిళ్ళుచేసి వాళ్ళు హాయిగా కళకళలాడుతుంటే చూస్తూ, వాళ్ళ పిల్లలను తాతయ్యగా తాను ఎత్తుకుని మురిసి పోవాలని, ఇంకా ఎన్నెన్నో, మరెన్నో కలలుకంటాడు కాని తాను కన్నకలలకి వాస్తవ జీవితానికి సమన్వయం కుదరక ఎంతో అసంతృప్తితో అసంపూర్ణంగానే జీవితాన్ని ముగిస్తాడు అందరికి ఏదో చెయ్యాలనే తహతహ ఎన్నో ఆశయాలు భవిష్యత్తు మీద ఎన్నో ఆశలు జీవితం పెరిగిన కొలది ఆశలుకొండల్లా పెరుగుతూనే ఉంటాయి ఇంక మనిషి జీవితం పరిపూర్ణత్వం చెందేదెప్పుడన్నయ్యా!"

"నీతో నేను వాదించలేను మధూ! అయితే ఇక నీ నిర్ణయం మార్చుకో నట్లేనా!"

"నాకు నేను నిర్ణయించేసుకున్న జీవితంలోనే తృప్తి ఉందన్నయ్యా! ఆనందంతో చివరి క్షణం వరకు తృప్తిగా జీవించటమే ఒక గొప్పవరం ఈ జీవితాన్ని ఎంతగా ప్రేమిస్తున్నానో మృత్యు వుని కూడా అంతగా ఆరాధిస్తున్నా నన్నయ్యా" అంది మాధురి నవ్వుతూ.

* * *

ఆరోజే మాధురి ప్రయాణం అందరి మనస్సులు బరువుతో నిండి ఉన్నాయి

"రవీంద్రా! మీ స్నేహితురాలిగా నాదొకకోరిక రాధిక మీకు తగిన ఇల్లాలుగా రాణించకలదనే నేన భావిస్తున్నాను మీరిరువురు వివాహం చేసుకుని ఈ గ్రామాన్ని ఇంకా ఆదర్శవంతంగా తీర్చి దిద్దాలని నా కోరిక మన్నిస్తారు కదూ!" రాధిక వైపు చూస్తూ అంది మాధురి వేడికోలుగా

ఏమి సమాధానం చెప్పలేక చూస్తూ నిలుచుండి పోయారిరువురు

కదులుతున్న ట్రెయిన్‌లోనుంచి చెయ్యి ఊపింది మాధురి, కన్నీటి తెరల మధ్యనుంచి మసక మసకగా చూస్తూ

మధూ! నీ స్నేహ మాధుర్యం తనివితీరా ఆస్వా దించాలని పరుగులెత్తింది నా మనస్సు కాని నా కందని దూర తీరాలకు ఎగిరి పోయావు నువ్వు మరో జన్మకైనా నీ చల్లని స్నేహ మాధుర్యం లభించా లని దైవాన్ని మనసారా కోరకుంటాను మధూ! దైవం ఈ ప్రేమ తపస్వికోరిక కాదనలేడు అప్పటి వరకు నీ కోసం వేచి ఉంటాను మధూ! వేచి వుంటాను!" శూన్యంలోకి చూస్తూ అను రవీంద్ర ●

# ఫాలాక్షుని డైరీ

## రైల్వే ఉద్యోగుల్లో దొంగ రవాణా

రామనాథపురం—మధుర ప్యాసింజరుబండి రామ నాథపురంలో ఆగివుండగా కస్టమ్స్ అధికారులు ఆ రైలుబండి ఇంజను సోదాచేస్తే (23వ తేదీ) నీళ్ల టాంకుక్రింద పన్నెండువేల విలువ చేసే యాలకులు తదితర సుగంధ ద్రవ్యాలు దొరికాయట ఈవిధంగా రైల్వే ఉద్యోగులు దొంగరవాణా చేయడం క్షమింప రాని నేరమని కస్టమ్స్ అధికారులన్నారట కష్టమే కదా!

## స్థంభం తగిలి మరణం

మద్రాసులో చార్టర్డ్ ఎకవుంటెన్సీ చదు కుంటున్న విశాఖపట్నవాసి 23 ఏళ్ళ గణపతిరావు అనే అతను ఎలక్ట్రిక్ట్రైనులో ప్రయాణం చేస్తూ బయటి స్తంభం తగిలి చనిపోయాడట

## ప్రోత్సాహంలేని ముద్దులు

ఇటలీలో వో జంట కనుక పబ్లికున ముద్దు పెట్టు కుంటే ఆ యిద్దరిలో స్త్రీగనుక కేవలం ముద్దు పెట్టించుకుని తానేమీ ప్రోత్సాహ మివ్వనట్లయితే తప్పంతా పురుషుడిదేనట స్త్రీ నిరపరాధిట ఈ విషయం వో కేసు సందర్భంలో రోమ్‌లో జడ్జీగారన్నారట రోములోని ఇటాలియన్ పియా జాలో పబ్లికున బ్రెడ్‌ఫీల్డ్ అనే యువకుడు అలె గ్జాండ్రాషరీప్స్ అనే ఆమెను ఏకధాటిగా ముద్దు పెట్టుకుంటుండగా భరించలేని వో చూపరి పోలీసు లకు ఫోనుచేసి పిలిపించాడట పోలీసులొచ్చి యువ కుని భుజంతట్టేసరికి అతను తప్పువన్న పోలీసుముఖం మీద వుమ్మాడట కోపంతో ఈ సందర్భంగా జడ్జిగారు తీర్పిస్తూ ఆ రకంముద్దులను "బూతు"గా వర్ణించడం కన్నా "అసభ్యం" గా వర్ణించడమే మైటరన్నారట ఆ స్త్రీని విడుదల చేయిస్తూ బ్రెడ్ ఫీల్డుకు మాత్రం శిక్ష వేశారట

## ఆదాయంపన్ను కట్టని వైస్ ప్రెసిడెంటు

తన ఆదాయం 1970 లో 24 మిలియను డాలర్లున్నా (18 లక్షల రూపాయలు) తానాఏడు చిల్లిగవ్వైనా ఆదాయం పన్ను కట్టలేదని యునై టెడ్‌స్టేట్స్ వైస్‌ప్రెసిడెంట్ డెజిగ్నేట్ మిస్టర్ నెల్సన్‌రాక్‌ఫెల్లర్ అన్నారట ఈయన అమెరికా లోని చాలా చాలా ధనికులలో ఒకరట అంత ధనికుడవడానికి కారణంబెద్దే!

## విదేశీ భార్యల గౌరవం

తాను 1976 ఎన్నికలలో ప్రెసిడెంటు పోటీ లకు నిలబడేదిలేదని, యిది తాను ఏనాడో చేసు కున్న నిర్ణయమని, తాను తన భార్యలో చర్చించి ఎన్నికలకు నిలబడకూడదని నిర్ణయించుకున్నానని సెనెటర్ ఎడ్వర్డ్ కెనెడి (యునైటెడ్ స్టేట్స్) అన్నా రట — విదేశీయులు తమ భార్యలకు ఎంతెంత గౌరవం యిస్తారో చూడుడు

## మంత్రుల ప్రమాణ స్వీకారంలో ...

ఆంధ్రలో కొత్తమంత్రుల ప్రమాణస్వీకారం జరుగుతున్న సమయంలో (హైదరాబాద్) అహూ తుల సీట్లలో కూర్చునివున్న ఒకామెకు నొప్పులు ప్రారంభమయ్యాయిట గమ్మున ఆసుపత్రికి తీసుకు వెళ్లేసరికది ఎబార్షనయ్యిందట

## ఎందరికో లొంగక తుపాకితో చచ్చిన పాము

నార్త్ బొంబాయికి చెందిన దూహిన్‌లో ఒకా విడ తన యింట్లోని డైనింగు టేబులు (అన్నాలు తినేబల్ల) క్రింద చుట్టుకు పడుకున్న ఎనిమిది అడుగుల త్రాచుపామును చూసి కేకెట్టి పోలీసులను పిల్చుకొచ్చిందట వారూ, అగ్నిమాపకదళం వారు శాయశక్తులా దాన్ని చంపడానికి ప్రయత్నం చేసి, కుదరక్కూర్చునేసరికి పోలీసు ఆఫీసరుగారు డుమీల్ డుమీల్ అని కాల్చి చంపేశాడట ఇది 25వ జరిగినది

## హద్దు మీరిన కోప్యాగ్ని

మధ్యప్రదేశ్ యం ఎల్ ఏ మిస్టర్ ఉమేద్ సింగ్ రాధియా అనే ఆయన కాగ్గియా అనే వూరుకు వెళ్ళి, విశ్రాంతి మందిరంలో (29వ) వుండగా




"స్మగ్లర్‌లనీ, గుప్తధనాన్నీ ఇలా పట్టేసు కుంటూంటే ... రేపు ఎలక్షన్లలో వోట్లు కొనడానికి పెట్టుబడి ఎవరు పెడతారూ? ..."

"పిచ్చిరాముడూ! ఇలాంటి పనులు చేస్తే . ఓట్లు కొనవలసిన పనే ఉండదు! . అవే వస్తాయి!"

# ఫాలాక్షుని డైరీ

కొంతమంది విద్యార్థులు ఆయన్ను పట్టుకుని, ముఖానికి బూటు పాలిష్ రంగు రాసి, చెప్పులదండ మెడల్లోవేసి కార్పొరియా పురంతా ఆయన్ను గాడిద మీద పూరేగించి ఎరివదిలారట అదేమంటే ఆయన తానెన్నికైన ప్రదేశం కశువుతో కటుకట లాడుతున్నా కిమ్మనకుండా కూర్చున్నాడని విద్యార్థు లన్నారట మిస్టర్ రాధియా పోలీసు రిపోర్టు కూడా యివ్వలేదట పోలీసులే వెళ్ళి ఏమిదని అడిగితే నేను ప్రజల చేత ఎన్నుకోబడినవాడిని, వారి సంతోషాన్ని, కోపాన్ని కూడా స్వీకరించాల్సిన వాడిని అన్నారట— వాట్ డిడ్ గాంధి సే . .

## మద్రాసు హోటల్లో స్త్రీ శవం

మద్రాసులోని టీ నగర్‌లోని వో హొటల్లో తన పేరు బాబు అనీ, తాను తిరుపతినుంచి వచ్చాననీ ఒకతను చెప్పి, రూము తీసుకున్నాడట ఆతనితో పాటు వో అమ్మాయి కూడా వుందట 22వ తేదీ రూము తీసుకున్నాడట 23వ తేదీన తాళం వుందట అది ఎన్నాళ్ళయినా తెరవడానికిబాబు రాలేదట ఈ లోగా ఆ గదిలో నుంచి వాసనొచ్చిందట పోలీసొచ్చి చూసేసరికి లోపల ఆ అమ్మాయి శవం కుళ్ళి, భయంకరంగా వున్నదట

## స్మగ్లర్లను పట్టుకోవడం రాజకీయమా !

ఉత్తరప్రదేశ్‌లో పేద్ద పేపరుమిల్లు వున్న ఒకాయనయింటిని ఢిల్లీలో 25వ తేదీన సోదా చేస్తే ఆదాయంపన్ను శాఖవారికి ఏడులక్షల కిమ్మతు చేసే వజ్రాలు దొరికాయట బాపురె !! అసలిస్మగ్లింగును, స్మగ్లర్లను పట్టుకోవడం అనేది కేవలం కాంగ్రెసు ఎన్నికలకోసం చేస్తున్న తమాషా పొమ్మని సోషియలిస్ట్ యం పి మిస్టర్ మధులిమాయే అన్నారట— బ్రా వో !!

## పయోరియాకి మందు వేస్తే ప్రాణమేపోయె

పయోరియా రోగంతో బాధపడుతూ జి ఎ మెల్కి అనే పోలీసు డిప్యూటీ సూపరింటెండెంట్ మిరదాబాదు ఆసుపత్రికి వెళితే అక్కడి డాక్టరాయనకు గ్లూకోజు యింజక్షను చేశారట. దాంతో మెల్కి చనిపోయారట

## రు. 20 లక్షల వజ్రాలు !

బొంబాయిలో ఆదాయపు పన్ను శాఖవారు, సి బి ఐ వారూ కలసి చేసిన దాడులలో 7 వ తేదీ 20 లక్షల విలువచేసే వజ్రాలూ, 45 వేలు రొఖ్ఖమూ దొరికాయట -

## పరమశివుని నేర్పు !

మద్రాసు మాంబళం ప్రాంతంలోని కొన్ని ఇళ్లలో వున్నట్టుండి పాములు, కొండ చిలువలు చిన్నా పెద్దవి ప్రత్యక్ష మవుతున్నాయట దాదాపు వో వీధిలోని చాలా ఇళ్లల్లో యీ రకంగా పాములు కనుపించేసరికి ఆఇళ్ల వాళ్ళంతా భయపడి ఆ రోడ్డుమీద పోతున్న వో పాములవాడిని బ్రతిమాలారట ఆతను తన వాద్యలాఘవంచేత అంది రిళ్ళల్లోనూ పాములు పట్టేసి, పారితోషికమూ పట్టేసి, వెళ్ళిపోయాడట ఆనక ఆ ఇళ్లవారి కసలు కిటుకు బోధపడిందట అవన్నీ అతని పెంపుడు పాములేనట, తెలివిగా ఆతనుపాములను ఇళ్లల్లో వదలి పెట్టే, ఆనక తానే వెళ్లి వారిని రక్షించినట్టు నటించి, వారివద్ద బోలెడు డబ్బు గుంజాతున్నాడట ఇది జీవనోపాధిక పరమశివుని నేర్పులావుంది

*

ఇటీవల కడప, రాయచోటి ప్రయాణికుల బస్సు కడపనుంచి 26 కిలోమీటర్ల దూరంలో వున్న గువ్వల చెరువు ఘాట్‌లో ఆరు మీటర్ల లోయలోకి దొర్లి పడిపోయిందట ఫలితంగా 30 మందికి బాగా గాయాలు తగిలాయట ●

# లాలస

(18వ పేజీ తరువాయి)

బొత్తిగా ఏమి తెలియదు అంత పెద్ద పట్నంలో ప్రస్తుతం దానికి నువ్వే అండ" అని కూడా వ్రాసింది వుత్తరం అత్తగారికి చూపించింది అనూరాధ. చూపించకపోతే ఏవైనా రహస్యాలు వున్నాయను కుంటారు. చూపిస్తే గొడవ వుండదు పైగా ఇష్టమయితే తనని పంపుతారు ఇంక ప్రత్యేకించి తను అడిగే అవసరం వుండదు అనుకుని వుత్తరం చదవమని ఇచ్చింది రాజ్యలక్ష్మమ్మ కూడా మంచి మర్యాదస్తురాలు

ఒక ఆదివారం కూతుర్ని తోడిచ్చి పంపింది అనూరాధకి అక్కడి రోడ్లు దార్లు అసలేవి తెలియవు ఆడపడుచే ఆ అవస్థలన్ని పడింది. మేనత్త రాసిన గుర్తుల ప్రకారం ఇల్లు తొందరగానే గుర్తుపట్టారు మేడమీద ఆరేసిన శాంత చీర చూసి అనూరాధ చప్పున గుర్తు పట్టగలిగింది

ఇంటి కిరాయి 75రూ.లు. వున్నవి రెండు గదులే అయినా పోర్షన్ నీటుగా బావుంది. గోడలకి గులాబీరంగు, మొజాయిక్ ఫ్లోరింగుతో పోర్షన్ చాలా అందంగా వున్నది. శాంత కూడా ఇల్లు బాగానే సర్దుకుంది శాంత సంసారం చూస్తే అనూరాధకి చాలా ముచ్చటేసింది. ఎంతైనా వేరింటికాపురంలో వున్న స్వేచ్ఛ, ఆనందం కలిసి వున్న సంసారాల్లో లభ్యంకావు. వేరింటి కాపురం వల్ల భార్యాభర్తలు పరస్పరం అర్థం చేసుకునే అవకాశం ఎక్కువగ వుంటుంది రోజు రోజుకి బాగా సన్నిహితులై వారి వివాహబంధం—విడరాని బంధమవుతుంది. నా కంటే చిన్నదయినా శాంత ఎంతో అదృష్టవంతురాలు అనుకుంది అనూరాధ

(ఇంకా ఉంది)

# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి

**పి ఆర్ పోరంకి.**

ఎన్ని తరాలు మారుతున్నా యీ ఆడది మగవాని చేతిలో కీలుబొమ్మగా వుండవలసిందేనా ?

తరాలు మారడానికీ—ఆడది మారడానికీ—సంబంధం ఏమిటి ? మారదల్చుకోని వాళ్లని ఎవరూ మార్చలేరు. ఆడడానికి సిద్ధపడితేనే కద కీలుబొమ్మగా ఆడిస్తారు

**ఎ. కె ఎస్ తిరుచునాపల్లి**

మీకు చుట్టాలంటే చాలా అయిష్టం అనుకుంటాను ?

అబ్బే ! అదేం లేదే ! చుట్టాల రాక— ఆనందాన్ని యిస్తుందండీ, కనీసం వచ్చినప్పుడు కాకున్నా వెళ్లినప్పుడేనా ?!

**కె. వై. ఎస్ పెంటపల్లి**

ఆడవారంత కఠినాత్ములు ఎవరూ లేరనుకుంటాను

నిజమే ప్రకృతి వారికి కొన్ని బలహీనతలని ,బాధ్యతలని యిచ్చింది తన ఆశలని ఆశయాలని అన్నింటినీ తనవాళ్లచుట్టూ అల్లుకుని బయటి ప్రపంచం మరిచిపోతుంది ప్రేమ మగవాడికి స్వేచ్ఛనిస్తే ఆడదానికి బాధ్యత నిచ్చి వ్రాయలని వ్రాతగా యిచ్చింది అందుతే తన బాధ్యతల నిర్వహణలో—చపలత్వానికి స్వస్తిచెప్పి ఆడది కాస్త కఠినాత్మురాలు అవుతూంది, మీ పురుషుల దృష్టిలో 'ప్రేమినూ బతికేయలేమా ?' అనే పురుషునికి 'పెళ్లి చేసుకుందాం' అనే స్త్రీ కఠినాత్మురాలిగా, కన్పించడంలో ఆశ్చర్యంలేదు.

**ఎ. వి. ఎస్. తెనాలి.**

ప్రభుత్వం చౌక డిపోలద్వారానో మరే ఇతర మార్గాలద్వారానో తక్కువ ధరలకు నిత్యావసర వస్తువులు సరఫరాచేస్తే బాగుంటుంది కదా ?

బాగుంటుంది. కాని రాజకీయ నాయకులు ఎలా బతుకుతారు—సామాన్యుని రక్తం పీల్చేకదా ? ఆందోళనలు, సమ్మెలు, గోలలు ఇవన్నీ వారి పబ్బం గడుపుకుందుకుగాని—మనని ఉద్ధరించడానికి కాదండీ, రాజకీయపు చదరంగంలో నలిగిపోయే పావులు ఎవరికావాలి ? చివరికి నిలబడే నాయకులు ముఖ్యం గాని ఏం ? జీతాలు బత్తాలు పెంచాలని, పెంచమని యీ గోలకి బదులు ధరలమీద 'ఫ్రీజు' ఎందుకు తేరో నాకూ అర్థం కాదు ? అది వాళ్ల కూటోన్ని దుమ్ము పోసుకోడం అవుతుందనేమోగా ?

**పి. వై. జి. హైదరాబాదు.**

నేను జన్మించిన వంశంలో తల్లీ తండ్రీ ప్రేమను నోచుకోలేదు

ఏం వంశం నాయనా అది ? సూర్యవంశమా ? చంద్రవంశమా ? .

**ఎస్. ఆర్. పూతలపట్టు.**

ప్రశ్నలను తేలికగా తీసుకోవద్దని మనవి మీ జవాబులు చదువుతున్నాను. ప్లయిన్‌గా జవాబిచ్చారు. మనిషి మనసుని చంపుకుని బతకడం ఎలా ? ఆడదానిలో నాగరికత పెరిగితే మగవానిలో మంచితనం నశించు తుందంటారు మీరేమంటారు

ఏమన్నా ప్లయిన్‌గా జవాబిచ్చానంటావని భయంగా వుంది బాబూ ఎలా ? . చాలామంది మనసు చంపుకునే బతుకుతున్నారని తెలియదా ? ఇక నాగరికత అంటే ఏమిటి ? చెడిపోడమనా నీ ఉద్దేశ్యం ?! లేక ఆడది ధైర్యంగా బతకడం ప్రారంభించితే—మగవాడు మంచితనం చంపుకుని ప్రవర్తిస్తాడనా ?!

**బి ఆర్ ఎన్. కమలాపురం.**

మీకు భగవంతుడు చాలా ఎక్కువ బ్రెయిన్ ప్రసాదించినాడా ?

లేదే కాస్త సారవంతమైన మట్టిపెట్టివుంటాడు దాన్ని బాగా ఎరువులూ గట్రావేసి వ్యవసాయం చేస్తున్నాను !

**ఎ. ఎస్ కె జగిత్యాల.**

మనదేశంలో ధరలు ఆకాశాన్ని అంటుతున్నాయి. ఇవి ఇలాగే వుంటే సామాన్య ప్రజలు వస్తువులు కొనలేక చావడమేనా ?

సామాన్య ప్రజ చాలా వస్తువులు కొనడం మానేసి చాలారోజులు అయింది 'ఇంకా ఎంత పెరుగుతాయో చూద్దాం' అని చూస్తూ వున్నారిప్పుడు

**ఐ. వి వి పి. ఆర్. మద్రాసు**

ఒకడు చేసిన నేరానికి అన్యాయంగా మరొకడు శిక్షను అనుభవిస్తే అతని మనస్సు ఎలావుంటుంది ?

నిజమైన త్యాగిలా శిక్ష ననుభవిస్తే ఏమీ అనుకోడు—కాని కక్షతో శిక్ష ననుభవించివస్తే—అసలు వాడి అంతుపట్టాలను కోవడం—మానవనైజం కదా ?

**జి. వి. ఆర్. విశాఖపట్నం.**

సంఘంలోని వర్గాలెన్ని వుంటాయి ?

ప్రతి సంఘంలోనూ ముఖ్యమైనవి రెండు వర్గాలే ఒకటి ' తిండి ఎక్కువ—ఆకలి తక్కువా వాళ్ళు, రెండు ఆకలెక్కువా —తిండి తక్కువా వాళ్ళు ! !

ఈ కాలం పిల్లలు వినిపించినా వినబడనట్టు ప్రవర్తిస్తారెందువల్ల ?

అందరి పిల్లలూ ఎందుకుపల్కరో తెలియదుకాని నా పిల్లలు మటుకు—పిల్చి పిల్చి పలక్కపోతే — అంతా ఎక్కడ ఆఘోరిస్తున్నార్రా అనిగాండ్రిస్తే — బీనాదేవికీ — చండీదాసుకీ మధ్య —నంటూ సమాధానం చెప్పింది —రెండోది !

ప్రతి మగవాడు తన భార్యలో కోరేది ఏమిటి?

మగవాడికి తన భార్య —తన తెలివి అర్థం చేసుకునేటంత తెలివికలదీ, అదే ఘనత అనుకునేటంత తెలివితక్కువదీ —కావాలనుకుంటాడు!

**జె. జి కె కందుకూరు.**

నేను బతికి ఏదీ సాధించలేకపోతున్నప్పుడు — చావడంలో తప్పేమిటి ?

చావు—అవకాశాలన్నిటికీ ముగింపు పల్కుతుంది కనీసం బతికివుండే ఏదో అవకాశానికి— ఛాన్సు వుంటుంది కదా ?

**పి. జె ఆర్. ఖర్గపూరు.**

మీరు మగవాళ్ళను దూషిస్తారు మరిఎందుకు పెళ్ళిచేసుకున్నారు ?

నేను మగవారిని దూషిస్తానా ! మా గణపతి శాస్త్రిగారినో, కృష్ణశాస్త్రి గారినో . . శివశంకర స్వామివారినో అడిగి చూడండి —వారూ మీ లాగే అంటే నా ధోరణి మార్చేస్తాను! ! . . .

**ఎస్ ఎస్. ఎన్ బెంగుళూరు**

ధనం, అహం కాం , కోరిక, ఆశలు నాలో లేవు సామాన్యమైన నన్ను పెళ్ళిచేసుకుందుకు . . నిర్మలమైన మనస్సు ఆత్మీయత అనురాగం యివ్వగల స్త్రీ పెళ్ళి చేసుకొనుటకు ముందుకు రాగలదా ?

రాదు మీకే కాంక్షా, కోరికా, ధనం, అహం ఏవీ లేదంటూ —యింక పెళ్ళి కాంక్ష ఎందుకు "ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును" అని కదా కవి వాక్కు. మీరివ్వని దానికోసం ఎదురుచూడ్డం అత్యాశ

**పి. ఎస్. అనంతపురం**

నవలలు చదివేందుకు అందరూ ఆసక్తి చూపుతారు క్లాసు పుస్తకాలు చదవడంలో ఆసక్తి చూపరెందుకు ?

నవలల్లో పరీక్ష పెట్టరు క్లాసు పుస్తకాలు పరీక్షకోసం చదవాలి అంచేత బోర్

**ఎమ్ ఏ ఆర్. విశాఖ**

నేను "వాడిన పూలు" అనే కథ రాశాను దానిని రామలక్ష్మి అక్కకు అంకితం యివ్వాలనుకుంటున్నాను మీరేమంటారు ?

అచ్చు వేయించే బాధ్యత మటుకు నాకుపెట్టకు తవమ్మడూ, అంకితోత్సవం సంగతి నేను చూసుకుంటాను ! !

త్వరలో కొత్త సీరియల్

## "ఇద్దరమ్మాయిల కథ"

ప్రారంభం !

సం.

# మహారాష్ట్రంలో మహాలక్ష్మి

(15 వ పేజీ తరువాయి)

మైన చోటును వెదకి వెదకి—చివరకు మహారాష్ట్ర ములోని 'కొల్హాపురము'న ఆశ్రమమును-కల్పించి కొని—దశ దిక్కుల్లోనూ—దేవీగణాల్ని కాపలాఉంచ "శ్రీ నారాయణాష్టాక్షరీ" మహామంత్ర జపాన్ని చేసిన చోటిది ఈ కొల్హాపురం పండరీపురమునకు సమీపముగా అరేబియా సముద్ర తీరమందున్నది

కొల్హాపుర నగరంలోని పురాతన రాజమందిరా నికి సమీపమునగల 'ఖజానా' వెనుక భాగమున విశాలమైన మహాలక్ష్మి దేవాలయం ఉంది ఆ దేవిని అంబ—లక్ష్మి మొదలైన పేర్లతో ప్రజలు నిత్యం స్మరిస్తూ ఉంటారు ఆ దేవాలయం చుట్టూ పెద్ద ప్రాకారం ఉంది ఆ ప్రాకార మధ్యభాగంలో 'శ్రీ మహాలక్ష్మి' వెలసి ఉంది

లక్ష్మి దేవాలయ ప్రాంగణ ప్రధాన భాగము లన్నియు నీలమైన రాతితో నిర్మింపబడియున్నది దాని సమీపంలో పద్మసరోవరం, కాశీతీర్థం,మణి కర్ణికాతీర్థం అనునవి ప్రసిద్ధములైన తీర్థములు ఈ లక్ష్మి దేవాలయమే కాక—కాశీ విశ్వనాథుడు, జగన్నాథస్వామి దేవాలయములు ఇచట వెలసిఉన్నాయి.

మహారాష్ట్రులు, గుజరాతీలు, ఇతర రాష్ట్ర ములవారూ — దసరాలోనూ దీపావళి పర్వదినము ల్లోనూ 'మహాలక్ష్మి'ని నాటినుండీ నేటివరకూ పూజించి తమకోరికలను నెరవేర్చుకొనుచున్నారు.

మనం మన అభీష్టము నెరవేరుట కొరకు ఈ నాడు శ్రీ వేదాంతదేశికులవారి 'శ్రీస్తుతి'(లక్ష్మి స్తుతి) నుండి ఈ రెండు శ్లోకాలనూ పఠించు కొందాం

'మానాతీత ప్రథిత విభవాం మంగళంమంగళానాం
వక్ష పీఠం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యా,
ప్రత్యక్షాను శ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియమ శరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే"

హే లక్ష్మి, నీ యొక్క వైభవం సాటిలేనిది, అత్యంత ప్రసిద్ధమైనది, నీవు సమస్త మంగళము లనూ మంగళములను చేయుదానవు మధుదైత్యు లపై విజయము పొందునప్పుడు విష్ణుభగవానుని వక్షస్థలముపై నీ యొక్క కాంతిచే ప్రకాశించు నట్టిదానవు. నీ మహిమలను పొగిడే ప్రజలకు శుభ ములను కలుగజేయుదానవు నీవే మాకు శరణ్యమవు నీవు 'శ్రీ'వి నిన్ను శరణుజొచ్చుచున్నాను

'కల్యాణానామవికలనిధి కాపిప కల్యాణసీమా
నిత్యామోదా నిగమవచసాం మవులిమందారమాలా
సంపద్ దివ్యా మధువిజయిన సంనిధనిత్యా సదామే
సైషాదేవీ సకల భువన ప్రార్థనా కామదేను

హే లక్ష్మి, నీవు కల్యాణపరిపూర్ణనిధివి, కరుణా మయివి నిత్యానంద రూపవు కూడా శ్రుతులపై (వేదములు) ధరింపబడిన మందారమాలవు నీవు మధువిజేతయైన విష్ణువు యొక్క శక్తివి నీవే సమస్త ప్రపంచములోని మానవుల ప్రార్థనలను స్వీకరించు 'కామదేను'వవు, ఇట్టి లక్ష్మిదేవి సదా నా హృదయములోనివసించుగాక !






ఊరించే మనసుపడేటి రంగులు
మరియు ప్రింట్ల నుండి పర్వీన్
ఆమెకు నచ్చిన ఆకుల డిజైనులను
ఎంచుకొంటారు బొంబే డైయింగ
వారి లెక్కలేనన్ని రంగులు
మరియు ప్రింట్లు 100% పాలి
యెస్టర్ మరియు 100% ప్యూర్
కాటన్ చీరలు-'ఆషియానా',
'షిఫాలా' మరియు 'రేతిక'

**100% పోలియెస్టర్ చీరలు- బోంబే డైయింగ్ కానుక**

# కథా - కమామిషూ

— తాజీప్రసాద్

ఈమధ్య ఒక ప్రఖ్యాత హిందీ తార వివాహం జరిగింది. బొంబాయి తాజమహల్ హోటల్‌లో జరిగిన ఆ కార్యక్రమానికి వచ్చిన వేలాదిమంది తారాభిమానులలో నలుగురు యువతులకి మానభంగము జరిగిందట! ఒక ఆంగ్ల సినిమా మాస పత్రిక పతాకశీర్షికతో ఈవార్త ప్రకటించింది

మరొక ఆంగ్ల సినిమా పత్రిక ఆ తార 'లఘు కార్యం' ఏ విపరిణామానికి దారితీసిందో వర్ణించే స్థితికి దిగజారిపోయింది.

'సిద్ధార్థ' నాయిక నగ్న చిత్రం ముఖ చిత్రంగా ప్రచురించిన ఒక మాస పత్రిక ప్రతులన్నీ నిముషంలో అమ్ముడు పోయాయి. అదే చిత్రాన్ని బహుళ ప్రచారంగల ఒక వార పత్రిక లోపలి పుటల్లో ప్రచురించినా కిమ్మన కుండా వున్న ఆ నటీమణి ముఖచిత్రాన్ని ప్రచురించిన పత్రికని కోర్టుకి లాగింది. చివరకు ఓడిపోయింది. ఈ మధ్యనే జరిగిన ఆ నటీమణి వివాహానికి కోర్టుకి లాగబడిన ఆ పత్రికాధిపతి హాజరయి ఆ వార్తని తన పత్రికలో ప్రముఖంగా ప్రచురించుకుని 'జరిగిన కథ'ని తిరిగి వ్రాసుకున్నాడు.

హిందీ చిత్ర సీమలో 'లేడీ కిల్లర్'గా ఆకాశాని కెత్తబడిన ఒక నాయకుడి గురించి పత్రికలు పేజీలు నింపేస్తున్నాయి. ప్రతి హీరోయిన్ తన కోసమే పుట్టినట్లు ఆ నటుడు ప్రవర్తిస్తాడని కుమారీ మణులు, కన్యలు, శ్రీమతులు అందరూ తన సొత్తేనని అతను అనుకుంటాడని ధర్మానికి ఇంద్రుడయిన అతనిని పత్రికలు 'లైమ్ లైట్'లో వుంచుతున్నాయి 'స్వప్నసుందరి'కి జరగని వివాహంలో అతనిని 'విలన్'గా పెట్టిపత్రికల 'రచ్చ' కీడ్చాయి.

ఒక కోటీశ్వరుడిని ఈమధ్యనే ఒక హిందీ సినీతార వివాహం చేసుకుంది. పెళ్లయిన వెంటనే ఆ తారతో ఆమె భర్త 'రోజుకి లక్ష రూపాయలకన్నా ఖర్చుపెట్టవద్దు' అన్నాడని ఒక పత్రిక ప్రకటించింది. ఎంత అతిశయోక్తి!

ప్రస్తుతం హిందీ చలనచిత్ర సీమలో నటీమణులు స్వీయ వివాహ కార్యక్రమాల్లో మునిగిపోతున్నారు జరగని వివాహాలు జరుగుతూ, జరుగుతాయనుకున్న వివాహాలు జరగడంలేదు. గాయని లతామంగేష్కర్ గూడా వార్తలలో చిక్కుకుంది. ఈ 'సమస్య' లను అన్ని కోణాలనుంచి పరిశీలించి సచిత్ర వివరాలతో కథా కమామీషూ చెప్తున్నాయి పత్రికలు.

చలనచిత్ర పరిశ్రమకి ప్రేక్షకులకు మధ్యన వంతెన కట్టవలసిన సినిమా పత్రికలు ఈ రోజున సినిమా పత్రికలుగా వుండడములేదు. చవకబారు శృంగార పత్రికలకు నమూనాగా మాత్రమే వుంటున్నాయి. తారల అర్ధనగ్న, ముప్పాతికనగ్న చిత్రాలు వర్ణాలలో ప్రచురించడమేకాక తారల వ్యక్తిగత జీవితాలమీద ఫ్లాష్ కొట్టుతున్నాయి ఈ పత్రికలు.

తారల సమ్మతి, సహకారం లేకుండా ఈ పత్రికలకి ఇంత స్వేచ్ఛ లభించదు తారలకి పత్రికలకి మధ్య పరస్పర అవగాహన వుండే వుంటుంది. పాఠకులను "వెవె" చేసే కార్యక్రమంలో తారలు పాత్రధారులుగానూ, పత్రికాధిపతులు సూత్రధారులుగాను వ్యవహరిస్తున్నారు.

తారల చిత్రాలు పత్రికలలో కనిపిస్తే ఆ చిత్రాలు వస్త్ర పరిశ్రమకి పేరు తేవడం లేదు వారు అసలు దుస్తులు ధరిస్తేగదా! అలాగే అనేకమంది తారల దినసరి కార్యక్రమంలో అప్రధానమయినవి, అనవసరమయినవి, అసాధ్యమయినవి పత్రికలలో ప్రధానంగా చోటు చేసుకుంటున్నాయి ఈ రకం వ్రాతలు జర్నలిజంలో 'న్యూవేవ్' క్రింద జమకట్టుకోవాలేమో!?




# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**ఎస్. ఎస్ ఆర్. కంభంపాడు**

నా వయస్సు 20 సం లు ముఖమునిండాగుల్లలు లేచి గిల్లినప్పుడు ముందు చీము తర్వాత నెత్తురు వస్తాయి

శరీరంలోని రోగనిరోధకశక్తులు తగ్గినప్పుడు ఇలా తరచూ వచ్చే అవకాశం వున్నది ఇలావస్తూ వున్నవారికి (స్టెఫ్లోస్టైఫలోవాక్సిన్ రోజు విడిచి రోజు 5 ఇంజక్షన్లు వేయించుకుంటే తప్పక నయమవుతుంది పైపూతకి "మిల్లీకార్టన్‌వయోఫాం" ఆయింట్‌మెంట్ వ్రాస్తే మంచిది

**ఎస్. ఎస్. ఆర్. హైదరాబాద్-1.**

నా వయస్సు 19 సం లు 4 ఏండ్ల క్రింద వేరేవూర్లో చెరువులో స్నానం చేశాను అప్పటి నుంచి చీదర, గిరితేవుండ్లు ఏర్పడు తున్నాయి

నీటిలో 'ఫంగస్'అనే సూక్ష్మ క్రిములుకలిసి వున్నప్పుడు ఇలా జరగటానికి అవకాశమువున్నది నీటిలో పసరు వున్నప్పుడు ఇలా రాగల అవకాశం ఎక్కువ

ఈ 'ఫంగస్' వున్నవారు "గ్రైసొవిన్ ఎఫ్ పి మాత్రలు రోజుకి ఆరువంతున పది రోజులు తీసుకోవాలి పైపూతకి "విట్ ఫీల్డ్" ఆయింట్‌మెంటు వాడాలి

**కె. కె. హైదరాబాద్.**

నా ఎడమ రొమ్మునందు దురద ప్రారంభమయి 6 నెలలు అయినది డాక్టర్ సలహా ప్రకారం "అస్కేబియాల్" వాడినా ఫలితం లేదు అక్కడ చర్మం నల్లగా అయింది

ఏ విధమైన చర్మరోగం అనేది తెలుసుకొని వైద్యం చెయ్యాలి గజ్జికురుపులకు మాత్రమే "అస్కేబియాల్" ఎక్కువగా ఉపయోగపడుతుంది ఇలావున్నప్పుడు "కెనాకార్ట్"ఆయింట్‌మెంట్ పైకి పూయాలి.

**ఎస్. జి. — రాజమండ్రి.**

నా వయసు 19 సం లు గత సం లో జ్వరం మొదలయింది కొన్ని ఇంజక్షన్లు వాడారు అప్పటి నుంచి తరచూ జ్వరం వచ్చి వారం రోజులకి తగ్గుతున్నది ఎక్కువ నడుం నెప్పి ఉంటుంది

ఈ లక్షణాలు మూత్ర సంబంధమైన రోగమును తెలియజేస్తుంది మూత్రపిండములు వాయటం, మూత్ర నాళములు అడ్డుపడటం, మూత్రాశయము వాయటం ఇలా రావటానికి కొన్ని ముఖ్య కారణాలు

మూత్ర పరీక్ష, ఇ.వి.పి, కడుపు ఎక్స్‌రే మొదలగు వాటి వల్ల రోగ నిర్ధారణ అవుతుంది రోగాన్ని బట్టి చికిత్స చేయవలసి ఉంటుంది

# నా శ్వాసలో శ్వాసించే నా ప్రియుడు

## నన్ను విడిచి క్షణం

## స్వర్గంలో కూడా ఉండలేనంటాడు

నిర్మలమై, తాజా రుచి గలిగిన బినాకా గ్రీన్ నాకెంతో అవసరమైన ఆత్మవిశ్వాసాన్ని చేకూర్చుతుంది. ముఖ్యంగా నేసతని చేరువనున్న మధుర క్షణాలలో. ఎందువల్లనంటే, బినాకా గ్రీన్‌లో శ్వాసయొక్క దుర్వాసనను హరించి మీ నోటికి రోజంతా హాయి గొల్పే తాజాతనాన్నివ్వగల ప్రకృతిసిద్ధమైన దురంధ-సంహారక పదార్థము, క్లోరోఫిల్ ఉన్నది. అందు చేత బినాకా గ్రీన్ నా కత్యంత ప్రియతమమైంది.

నన్నంతగా ప్రేమించే నా ప్రియుణ్ణి కేవలం నా వాడిని చేసిన బినాకా గ్రీన్‌కు ధన్యవాదాలు.




## మా గాథ అన్యోన్య ప్రేమకు కారణం- బినాకా గ్రీన్




బినాకా టూత్ బ్రష్‌కి గుండ్రటి కొనలు ఉంటాయి ఇగుళ్ళను ఏమాత్రం గాయపరచవు!

CIBA

Rediffusion/CG/66( Tel

మూత్రములో క్రిములు ఉంటే 'ఆంటిబయాటిక్‌లు' లేక ఏదైనా అడ్డుపడి ఉంటే శస్త్రచికిత్స చేయించుకోవాలి

ఎస్ — టాటానగర్.

మా పెద్దబ్బాయి వయసు 14 సం లు రాత్రి నిద్రపోయినపుడు మూత్ర విసర్జన చేస్తూ ఉంటాడు మూత్రం పోసిన చోట, తెల్లగా మరక కడుతుంది వాసన వేస్తుంది

మూత్రములో ఎక్కువ ఫాస్ఫేటు ఉండటం వల్ల ఇలా జరుగుతుంది "ఆల్కలైన్ సిట్రేట్" పూటకి 1 చెంచాడు అరగ్లాసు నీళ్లలో కలిపి మూడు పూటలా ఇవ్వండి ఎక్కువ పళ్లరసం, ఇస్తే మంచిది రాత్రి పడుకోబోయే ముందు మూత్ర విసర్జన చేయించండి తగ్గకపోతే వెన్నెముక, ఎక్స్‌రే తీయించండి అంతవరకూ 'టోఫ్రానిల్' మాత్రలు పూటకు ఒకటి చొప్పున, రాత్రిళ్ళు పడుకోబోయే ముందు ఇవ్వండి

బి ఆర్ పి ఖరగ్‌పూర్

మా అబ్బాయి వయస్సు 8సం లు ఒక వృషణము పెద్దదిగా వున్నది నెప్పిలేదు ఇలా పుట్టినప్పటినుండి ఉన్నది

కొందరు పిల్లలకు పుట్టుకతోనే "కంజెనిటల్ హైడ్రోసిల్" ఉండటంవల్ల ఇలా పెద్దదిగా కనిపిస్తుంది వృషణపుసంచిలో నీరుచేరటమే దీనికి కారణం శస్త్రచికిత్స ద్వార ఈ నీటిని తీసివేసి తిరిగి చేరకుండా చేయవచ్చును

వి జె రేపూడి

మా బాబుకి 3 సం లు దంతములన్నీ పాడైపోయినవి మీరు ఒక వారం సిమెంటు చేయించాలని వ్రాశారు కదా? అంటే సిమెంటు కలిపి ఖాళీస్థలములో పెట్టవలయునా? పళ్ళు వూడిపోయిన తర్వాత కూడ పిప్పిపళ్లు వస్తాయా?

ఇంకాసయిం, ఇంకొంచెం సున్న కూడా కలిపి వెయ్యవచ్చునా అన్నారు కాదు వైద్యులవద్ద ముఖతా చూపించకుండా గుడ్డిగా సలహాలుపాటిస్తే ఇలాగే వుంటుంది

పళ్ళు ఆరోగ్యంగా వుంచుకోవాలంటే మనం తీసుకునే జాగ్రత్తలే ముఖ్యం ఎక్కువగా తీపి తినటం, దంతములు సరిగా పరిశుభ్రం చేయక పోవటం, ఇలా జరగటానికి ముఖ్యకారణాలు ఇలా వున్నవారు, దంతవైద్యులను సంప్రదించాలి ●

డాక్టర్ సలహాలకు ప్రశ్నావళికి తమ సందేహాలు పంపేవారు కవరపై లేదా కార్డుపై శీర్షిక పేరు వ్రాసి సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక గాంధినగరం, విజయవాడ—3అనే చిరునామాకే తమ సందేహాలు పంపాలి.

సం.

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3, Editor . S. Radhakrishna



"కధానాయకుని కధ" లో



"అన్నదమ్ముల కధ" లో ప్రభ

## * సినీ బొమ్మల కొలువు *





"దేవుడు చేసిన పెళ్ళి" లో

